ఓ౩మ్

# ఆర్యాభివినయము

( మహర్షి దయానందసరస్వతీ రచితము )



అనుకర్త :

శ్రీ పండిత గోపదేవ్

అంబాదర్శన గ్రంథమాల - ౪౫

ప్రథమ సంస్కరణము - ౨౦౦౦



జనవరి 1984 పుష్యమాసము – రుధిరోద్గారి

మూల్యము

ప్రతులకు :

ఆర్య సమాజము

కూచిపూడి - తెనాలి తా॥ గుంటూరు జిల్లా

ముద్రణ :

విజయ ఆర్టు ప్రెస్ - తెనాలి.

# అంబాదర్శన గ్రంథమాల

మహారాజపోషకులు :—

1. శ్రీమతి కొత్తపల్లి యామినీపూర్ణ — కూచిపూడి
2. శ్రీ బెల్దె జగదీశ్వరయ్య శ్రేష్ఠి — సికిందరాబాదు
3. శ్రీ మాశెట్టి వేంకటేశ్వరరావు — ,,
4. శ్రీ కొసరాజు మాధవయ్య — నిడుబ్రోలు
5. శ్రీ వై. వి. సుబ్బారావు, సరోజనీదేవి — గుంటూరు
6. శ్రీ గ్రంధి కామరాజు — విజయవాడ
7. శ్రీ కావూరి జయచంద్రవర్మ — కూచిపూడి
8. శ్రీ చదలవాడ అచ్చేశ్వరరావు, రాజ్యలక్ష్మి — కూచిపూడి
9. శ్రీమతి చదలవాడ లక్ష్మమ్మ — కూచిపూడి
10. శ్రీ మట్టెడ్డి గురవారెడ్డి — తూములూరు
11. శ్రీ చంద్రయ్య అండ్ సన్స్, అల్వాల — సికిందరాబాదు
12. శ్రీ యం. యన్, బాలకృష్ణ, సుధాకర్ — సికిందరాబాదు
13. శ్రీ ఉప్పల రాజేశ్వరరావు — సికిందరాబాదు
14. శ్రీ కొసరాజు తిరుమలరావు, సూర్యకుమారి కురుమద్దాలి
15. శ్రీ గట్టె సుబ్బారావుగుప్త, నాంచారమ్మ — గుంటూరు
16. శ్రీ జక్కిడి సీతారామరెడ్డి సీతాఫలమండి, సికిందరాబాదు
17. శ్రీ తుమ్మల వల్లభయ్య — కూచిపూడి

రాజపోషకులు :—

1. శ్రీ కావూరి సంగయ్య — కూచిపూడి
2. శ్రీ జె. వెంకటరావు — వరంగల్

3. శ్రీ బి. శంకర్‌లాల్ — హైదరాబాదు
4. శ్రీ యలవర్తి రామకోటయ్య, సీతారత్నం — కూచిపూడి
5. శ్రీ కుమ్మరి పోచయ్య — సికిందరాబాదు
6. శ్రీమతి కొడాలి వేంకటరత్నమ్మ — సికిందరాబాదు
7. శ్రీ యం. భూపతిరావు – ప్రజ్ఞాపురం — హైదరాబాదు
8. శ్రీ సరిదే శ్రీనివాసరావు, కనకలక్ష్మి — రేలంగి, గోదావరిజిల్లా
9. శ్రీ వి. యస్. గుప్త — కొత్తగూడెం

పోషకులు :–

1. శ్రీ మేకా రామకృష్ణయ్య — కూచిపూడి
2. శ్రీ జాస్తి వెంకటప్పయ్య, తులశమ్మ — కూచిపూడి
3. శ్రీమతి దాసరి రామకోటమ్మ — కూచిపూడి
4. శ్రీ కన్నెగంటి శైలసుతనవరత్నకుమారి — కూచిపూడి
5. శ్రీ కోట్ల రమణారెడ్డి — సికిందరాబాదు
6. శ్రీ పోలం వీరయ్య సోదరులు — సికిందరాబాదు
7. శ్రీ కోడూరి సుబ్బారావు, సీతాఫలమండి — సికిందరాబాదు
8. శ్రీ దుర్గా సత్యనారాయణ, కృష్ణవేణి — తణుకు
9. శ్రీ కావూరి శివరామయ్య — మోపిదేవి
10. శ్రీ గడ్డిపాటి వేంకటకృష్ణయ్య — అమృతలూరు

# సంపాదకీయము

'ఆర్యాభివినయ' మను నీగ్రంథములో మహర్షిదయానంద సరస్వతీస్వామివారు వేదమంత్రములను పరమేశ్వరుని స్తుతించుటకు యోగ్యము లగువానిని సమకూర్చి యందున్న భగవంతుని గుణగణాదులను స్పష్టపఱచుచు తన్మయత్వములో చేయు స్తుతివిధానము అద్భుతముగా గానవచ్చుచున్నది. భక్తుడు తనలోనున్న దుర్గుణముల త్యజించుటకు భగవంతునిలో నున్న యుత్తమగుణముల సముపార్జించికొని యుత్తమపురుషుడగుటకు నీగ్రంథమెంతయో యుపయోగపడును. ఇందలి విశేషముల వివరించుటకంటె పాఠకులకు వదలుటయే మంచిదని తలంతును.

ఈగ్రంథమును హిందీభాషలో చదివిననాటినుండి శ్రీపండిత గోపదేవ్‌శాస్త్రిగారికి దీనియందు గలిగిన మక్కువతోడనే దీనిని తెలుగులో ననువదించి తెలుగువారి కందీయవలయునని పట్టుదల కలిగినది. దానిఫలితముగా నియ్యది (1976 ఏప్రిల్) నలనామసంవత్సర చైత్రమాసములో పూర్తిచేసి అంబాదర్శన గ్రంథమాలవారికి ముద్రణకొఱకు పంపిరి. కాని కొన్ని యనివార్యకారణములవలనను, ఆర్థికపరిస్థితులవలనను ముద్రణస్థితికి రాలేకపోయినది. ఇట్టి స్థితిలో ప్రస్తుతము సీతాఫలమండి (సికిందరాబాదు) నివాసులైన శ్రీ జక్కిడి సీతారామరెడ్డిగారు ఆర్య సామాజికులగుటచేతను, వైదికవాఙ్మయమునందు ప్రీతికలవారగుటచేతను భక్తులకుపయోగించు నీయుత్తమగ్రంథ ముద్రణము కావింపుడని అంబాదర్శన గ్రంథమాలవారికి మూడువేలరూపాయలు విరాళముగా నొసంగి భక్తులకెంతయో నుపయోగముచేసిరి. ఇట్టి సత్కార్యము లొనర్చుటకు వీరికి, వీరికుటుంబమునకు పరమేశ్వరుడు ఆయురారోగ్యైశ్వర్యాదు లొసంగి రక్షించుగాతమని సహృదయతతో కాంక్షింతును.

తెనాలి
25-1-84

—వెంకయార్య

# దాతృ పరిచయము

మెదక్ జిల్లా గద్వేల్ తాలూకా కూచవరము గ్రామములో శ్రీ జక్కిడి నారాయణరెడ్డి, రాజమ్మ అనుదంపతులుకలరు. నిజాంబాదుజిల్లాలోని సిరినపల్లి జమీందారు అయిన శ్రీమతి జానకీబాయి జమీందారిణి వద్ద శ్రీ నారాయణరెడ్డిగారు ఉద్యోగము చేసెడివారు. ఆ జమీకి సంబంధించిన జాగీరు గ్రామమగు 'రాంపూర్' అను గ్రామమందు శ్రీ నారాయణరెడ్డి దంపతులకు పరాభవనామ సంవత్సర చైత్రమాసమునందు పుత్రుడు జన్మించెను, ఆబిడ్డకు సీతారామరెడ్డియని నామకరణముచేసిరి. అబిడ్డడు దినదినాభివృద్ధిగాంచి ఆఱేడు సంవత్సరములురాగానే అచ్చటి వీథిబడిలో తెలుగు నభ్యసించెను. ఆకాలమున నిజాంపరిపాలన యగుటచే ఉర్దూకు ఎక్కువ ప్రాముఖ్యత యుండుటచేత ఉర్దూకూడ నభ్యసించెను. కాని యావిద్యలకు నెట్టి డిగ్రీలు లేవు.

అనాడు గ్రామకరణము, మునసబులకు పెత్తన మెక్కువగా నుండుటచే ఆపదవులకు ప్రాముఖ్యతయుండెడిది. అందుచేత భువనగిరితాలూకా చీకటిమామిడి గ్రామమునకు కరణముగా శ్రీ సీతారామరెడ్డి ఉద్యోగము స్వీకరించి పనిచేయుచుండెను. ఈయనకు సుశీలమ్మతో పెండ్లిజరిగెను. కొన్నినాళ్లకు ఈయన బావమఱిదియగు శ్రీ చింతల రామకృష్ణారెడ్డి (దేవరయాంజాల) శ్రీ గోదా బాలకిషన్ (బొలారం) గారల స్నేహము, ప్రోత్సాహమువలన శ్రీ దూల్‌పేట రాజరత్నమాచారిగారిచేత తెలుగులో ననువదింపబడిన 'సత్యార్థప్రకాశము'



శ్రీ జక్కిడి సీతారామరెడ్డి, సుశీలమ్మగారలు

చదివిరి. ఆరోజులలో శ్రీ సీతారామరెడ్డిగారికి ఉర్దూలోనున్న ప్రావీణ్యము తెలుగులో లేనందువలన పండిత నరేంద్రగారితో పరిచయముచేసికొని సుల్తాన్‌బజారులోని ఆర్య సమాజము నుండి ఉర్దూలోనున్న సత్యార్థప్రకాశము తెచ్చుకొని పూర్తిగా పఠించి బొలారం సమాజమునకు వెళ్లి పండిత సోమనాథరావు గారిచేత యజ్ఞోపవీత సంస్కారము చేయించుకొనిరి.

యజ్ఞోపవీతధారణముచేసిన 1935 సంవత్సరమునుండి 1946 సంవత్సరమువఱకు ప్రతిదినము శ్రీ సీతారామరెడ్డిగారు సంధ్యాగ్నిహోత్రములు చేసెడివారు. ఆరోజులలో పగలు రజాకార్లు రాత్రులందు కమ్యూనిష్టులు బయలుదేరి వారివారి యుద్యమమును అభివృద్ధిచేయుటచే గ్రామములో ప్రజలు నివసించుటకు భయభ్రాంతులై గ్రామములు వదలి తెలంగాణమునుండి యాంధ్రప్రాంతమునకు బయలుదేరిరి. అట్టి వారిలో చేరిన శ్రీ సీతారామరెడ్డిగారు మచిలీపట్టణమునకు వలసవెళ్లిరి. ఊరువదలగానే గ్రామములలో ఇండ్లు మొదలగు ఆస్తిపాస్తులను దగ్ధముచేయుటచే రెడ్డిగారి తక్కిన సామగ్రితో బాటు ఆర్య సమాజసాహిత్యముకూడ బూడిదపాలయ్యెను. పోలీస్‌యాక్షన్ తరువాత తిరిగి తెలంగాణమునకుచేరి మేడ్చల్ తాలూకా నూతనకల్ గ్రామమునకు పట్వారిగా తన తండ్రి గారిద్వారా సంక్రమించిన యుద్యోగముచేయుచు స్థిరనివాస మేర్పఱచుకొనిరి. శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారు మంత్రిగా నున్నంతవఱకు జిల్లాబోర్డు ప్రెసిడెంటుగా నియమింపబడి కార్యకర్తగా శ్రమించిరి. తరువాత కాంగ్రెస్‌లో అవినీతి పెచ్చుపెరిగి గబ్బుకొట్టుటచే కాంగ్రెస్‌నుండి తప్పుకొనిరి.

నూతన్‌కల్ గ్రామములో నూతనముగా గృహము నిర్మించుకొని పూజ్యపాదులైన శ్రీ పండిత గోపదేవశాస్త్రిగారిచేత గృహ

ప్రవేశ సంస్కారము వైదికపద్ధతిలో జరిపించుకొనిరి. దైనిక సంధ్యాగ్నిహోత్రముచేయుటకు వీలుకానందున ప్రతిసంవత్సరము సహస్రగాయత్రియజ్ఞము చేయించుచుండిరి.

ప్రస్తుతము సీతాఫలమండిలో నివసించుచు సీతాఫలమండి ఆర్య సమాజముతో సంబంధము కల్పించుకొని యా సమాజముపేర శాశ్వతమైన చందాగా మూడువేలరూపాయలు బ్యాంకులో జమచేసి దానివలనవచ్చు వడ్డీని ప్రతిసంవత్సరము శ్రావణి ఉపాకర్మ పర్వదినమునందు అగు ఖర్చునకు వినియోగింపవలయునని సత్సంకల్పముతో నున్నారు. మఱియు 'ఆర్యాభివినయ'మను ఈగ్రంథము ప్రథమ ముద్రణమునకు మూడువేలరూపాయలిచ్చి మిక్కలి తోడ్పడిరి. వీరిదాతృత్వము కొనియాడదగినది.

శ్రీ సీతారామరెడ్డిగారికి నలువురు పుత్రికలున్నారు.

1. శ్రీమతి కె. వసంత భర్త శ్రీ కె. గణేశ్‌రెడ్డి
2. ,, జె, విజయ ,, ,, జె. చంద్రశేఖరరెడ్డి
3. ,, పి. కృష్ణకుమారి ,, ,, పి. వీరారెడ్డి
4. ,, ఎస్. నిర్మల ,, ,, ఎస్. మధుసూదన రెడ్డిగారలు

ఇందు రెండవ పుత్రికయైన జె. విజయ శ్రీ సీతారామరెడ్డిగారి యింటిలో ఇల్లరికముగా భర్తతో కలసియున్నది. శ్రీ రెడ్డిగారితోబాటు వీరినందఱను పరమేశ్వరుడు ఆయురారోగ్యాది శుభముల నొసంగి రక్షించుగాత !

ఆర్య సమాజము - కూచిపూడి.

# తొలిపలుకులు

శ్రీ మద్దయానందమహర్షి సత్యార్థప్రకాశము, సంస్కార విధి, ఋగ్వేదాదిభాష్యభూమిక మున్నగు ననేకములగు ఉద్గ్రంథములు రచించియున్నారు. వానితోబాటు కొన్ని లఘుగ్రంథములును రచించిరి. వానిలో నీ యార్యాభివినయము భగవద్భక్తిపూర్ణమైన గ్రంథము. మహర్షిరచనలలో నిది యొక యద్భుతరచనయనిన నందెంతమాత్రము నతిశయోక్తి లేదు. ఎందఱో భక్తు లీగ్రంథమును పఠించి, యిందలి మంత్రగత భావనలతో భగవంతు నారాధించి తమజీవితములను సఫలము చేసికొనిరి.

"అన్యాయకారి యెంతబలవంతుడైనను వానికి భయపడరాదు. ధర్మాత్ముడు నిర్బలుడైనను వానికి భయపడవలయును.

"అధార్మికు డెంత బలవంతుడైనను, చక్రవర్తియైనను, ఎంతటి సనాథుడైనను, గుణవంతుడైనను వానిని నశింపజేయవలయును. అతని యవనతికి పాటుపడవలయును. అతనికి అప్రియము నెల్లప్పుడు కలిగింపవలయును." అను నీమహర్షి

మహోపదేశములను చరితార్థముచేయుట కెందఱో నడుముకట్టి జీవితముల నర్పించి భారతమాతను పరాధీనశృంఖలలనుండి విడిపింప యత్నించిరి. వారి సాహసోపేతకార్యములకు వారిని ప్రేరేపించిన దీ చిన్నపుస్తకరాజమే. కాకోరీ షడ్యంత్ర (కుట్ర)మునకు సంబంధించిన కేసుకు నాయకుడైన వీరశిఖామణి రామప్రసాద్‌బిస్మిల్ వధ్యశిలపైనిలబడి-

''మాలిక్ తేరీ రజా రహే, ఔర్ తూ హీ తూ రహే
బాకీ న మైం రహూం న మేరీ ఆరజూ రహే''

'సర్వేశ్వర ! నీకోరికయే నెఱవేఱుగాక ! నీవే యంతట విరాజిల్లుదువు గాక ! నేను కాని, నాకోరిక కాని మిగులరాదు.' అని దిక్కులను ప్రతిధ్వనింపజేయుచు నిర్భయముగా ప్రసన్న వదనముతో చేసిన ప్రార్థనకు ప్రేరణ కలిగించిన దీగ్రంథ రత్నమే. బిస్మిల్ నిత్యము జైలులోకూడ సంధ్యాగ్నిహోత్రము లొనర్చి యార్యాభివినయ మంత్రములతో ప్రార్థన చేయుచుండెడివాడు. ఇట్లే చంద్రశేఖర్ ఆజాద్ మున్నగు వీరదేశ భక్తుల జీవనచరితార్థమునకు తోడ్పడిన దీ గ్రంథరాజమే యని వారి సన్నిహితులు చెప్పగా వినుచున్నాము.

మహర్షి తన వచనములతో నీగ్రంథ మెందులకు వ్రాసెనో యిట్లు తెలిపియున్నాడు. ''ఈగ్రంథమువలన మను

ష్యులకు ఈశ్వరస్వరూపము తెలియును. అతనియెడ భక్తి యేర్పడును. కర్మనిష్ఠ, వ్యవహారశుద్ధి వారికి కలుగును. అందువలన మానవులు నాస్తికులు కారు, పాషండమతముల వంక బోరు, అధర్మముల నాచరింపరు.మనుష్యు డన్నివిధముల నత్యుత్తము డగును. సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుని కృప మానవులయెడ కలుగును. అందువలన మానవులు దౌష్ట్య మును విడిచి శ్రేష్ఠతను స్వీకరింతురు.'' ఈపుస్తక పఠనము వలన మహర్షి దయానందు డాశించిన ప్రయోజనము లివే.

ఈ యార్యాభివినయము శ్రీమద్దయానందమహర్షి ప్రణీతము. ఆర్య భాషాభాష్యయుతము. దీని నింతకు పూర్వమే యొక రిద్దరువ్యక్తులు తెలుగున అనువదించి ప్రచురించిరి. కాని, అందు మంత్రములకు ప్రతిపదార్థములు వ్రాయ వారు యత్నింపరైరి. మహర్షికృత భాషావ్యాఖ్యానమునకును వారు చేసిన ఆంధ్రీకరణ మంత సుబోధకముగా కనిపింపదయ్యె. వారి యనువాదములో తెలుగునుడికారముకూడ అంతగా కనిపింపదు. మహర్షికృత భాషావ్యాఖ్యానముకూడ అనువాద కర్తల కంతగా అర్థమైనట్లు నా కనిపించలేదు.

ఈ యార్యాభివినయమును దయానంద-ఉపదేశక మహా విద్యాలయమున జదువవచ్చిన విద్యార్థులకు బోధించు నవకాశముకూడ నాకు లభించినది. ఈ యవకాశమును పురస్క

రించుకొని, మంత్రములకు ప్రతిపదార్థము, మహర్షి వ్యాఖ్యానమునకు సరియైనభావము ఆంధ్రపాఠకుల కందజేయుట మంచిదని యెంచి నేనీగ్రంథమును తెలుగున వ్రాసి ప్రకటించుచున్నాను. ఆంధ్రపాఠకులు, భగవత్భక్తు లీ మంత్రముల నర్థసహితముగ పఠించి నిత్యము భగవంతుని స్తుతిప్రార్థనల నొనర్చి మహానందము ననుభవింతురని యాశించుచున్నాడ.

నలనామ సంవత్సర
చైత్రమాసము
24-4-1976

బుధవిధేయుడు,
గోపదేవ్.

ఓ౩మ్

తత్ సత్యపరబ్రహ్మణే నమః

# ఆర్యాభివినయః

'ఉపక్రమణికా'

"సర్వాత్మా సచ్చిదానందోఽనన్తో యో న్యాయకృచ్ఛుచిః
భూయాత్తమాం సహాయో నో దయాలుః సర్వశక్తిమాన్". 1.

"చక్షూరామాఙ్కచంద్రేఽబ్దే చైత్రే మాసి సితే దలే
దశమ్యాం గురువారేఽయం గ్రన్థారంభః కృతో మయా." 2.

"దయాయా ఆనన్దో విలసతి పరః స్వాత్మవిదితః
సరస్వత్యస్యాగ్రే నివసతి ముదా సత్యనిలయా,
ఇయం ఖ్యాతిర్యస్య ప్రలసితగుణా వేదశరణా
స్త్యనేనాయం గ్రన్థో రచిత ఇతి బోద్ధవ్య మనఘాః" 3.

"బహుభిః ప్రార్థితః సమ్యగ్ గ్రన్థారంభః కృతోఽధునా
హితాయ సర్వలోకానాం జ్ఞానాయ పరమాత్మనః" 4.

"వేదస్య మూలమంత్రాణాం వ్యాఖ్యానం లోకభాషయా
క్రియతే సుఖబోధాయ బ్రహ్మజ్ఞానాయ సంప్రతి" 5.

"స్తుత్యుపాసనయోః సమ్యక్ ప్రార్థనాయాశ్చ వర్ణితః
విషయో వేదమంత్రైశ్చ సర్వేషాం సుఖవర్ధనః" 6.

"విమలం సుఖదం సతతం సుహితం జగతి ప్రతతం తదు
వేదగతమ్
మనసి ప్రకటం యది యస్య సుఖీ స నరోఽస్తి సదేశ్వరభా
గధికః" 7.

"విశేషభాగీ హ వృణోతి యో హితం నరః పరాత్మాన
మతీవ మానతః
అశేషదుఃఖాత్తు విముచ్య విద్యయా స మోక్ష మాప్నోతి
న కామకాముకః" 8.

వ్యాఖ్యానము :—

1) పరమాత్ముడు అందఱకు-అన్నింటికి ఆత్మ, సచ్చిదానంద స్వరూపుడు, అనంతుడు, అజుడు, న్యాయము చేయువాడు, నిర్మలుడు, సదాపవిత్రుడు, దయాలువు, సర్వసామర్థ్యవంతుడు, మన ఇష్టదేవుడు. అతడు మిక్కిలి కఠిన కార్యములుకూడ సులభముగాజేయసమర్థుల మగునట్లు మాకు నిత్యము తోడ్పడుగాక! ఓ కృపానిధీ! మాయీకార్యమును నీవే సిద్ధము సేయువాడవు. నీవు మాకామమును- కొర్కెను నెఱవేర్తువని యాసించుచున్నాము.

2) (చక్షూరామాంక చంద్రేఽబ్దే) వి. సం. 1932వ సంవత్సరమున చైత్రమాస శుద్ధ దశమి గురువారమున ఈ గ్రంథారంభము నాచే చేయబడినది.

(superscripts over చక్షూ, రామ, అంక, చంద్రే: 2 3 9 1)

3) దయానందసరస్వతీస్వామి నామము ఈ(మూడవ) శ్లోకమున వర్ణింపబడినది.

(స్వాత్మవిదితః=నిజఆత్మజ్ఞుడు,పరః=శ్రేష్ఠుడు,అయిన, దయయా ఆనందః = దయానందుడు, విలసతి=ఉన్నాడు. అస్యఅగ్రే = ఇతనిముందు, సత్యనిలయా = సత్యము నిలయముగాగల,ప్రలసితగుణా=సుందరగుణములుగల,వేదశరణా= వేదములనాశ్రయించిన, సరస్వతీ = సరస్వతి, ముదా=ఆనందముతో, నివసతి= నివసించును, అను, ఇయం ఖ్యాతిః= ఈ కీర్తి,యస్య=ఏదయానందసరస్వతికి,అస్తి= కలదో,అనేన= ఈ దయానందసరస్వతిచే, అయం గ్రంథః= ఈ గ్రంథము, రచితః = రచింపబడినది, ఇతి = అని, హే అనఘాః = ఓ పుణ్యాత్ములార!, బోద్ధవ్యమ్ = తెలిసికొనుడు.

తా॥ దయానందసరస్వతి - తన అంతరాత్మను గుర్తించిన ఉత్తముడు అతని యెదుట సత్య నిలయ సుందర గుణ, వేదశరణయైన సరస్వతి యుండును. ఇట్టి కీర్తిగల దయానందునిచే ఈ గ్రంథము రచింపబడినది. పుణ్యాత్ములిట్లు తెలిసికొందురుగాక !

4) ఎల్లలోకులకు హితముకలుగుటకు, పరమేశ్వరుని జ్ఞానము యథార్థముగ కలుగుటకును, పరమేశ్వరునియెడ భక్తికలుగుటకును, ఎల్లరకు హితమొనర్చు, ధర్మాత్ములు విచారశీలురు నైన పెక్కురు విద్వాంసులు ప్రేమచే కోరినందున యీ గ్రంథ మారంభింపబడినది.

5) ఈ గ్రంథమునందు కేవలము నాలుగువేదములయు, బ్రాహ్మణ గ్రంథములయు మూల మంత్రములకు ప్రాకృతభాష (హిందీ) యందు వ్యాఖ్యానము చేయబడినది.

అందువలన నెల్లరకు సుఖముగా బోధకలుగును. బ్రహ్మము యొక్క యథార్థజ్ఞానముకూడ కలుగును.

6) ఈ గ్రంథమున పరమేశ్వరుని స్తుతి, ప్రార్థన, ఉపాసనలు, ధర్మాది విషయములును వర్ణింపబడినవి. కాని, మూలసంహితల మంత్రములవలనను, బ్రాహ్మణప్రమాణముల వలనను మాత్రమే యీ విషయ మెల్లరకు సుఖమును వృద్ధిచేయును.

7) విమలము, సుఖకారకము, పూర్ణకామము, తృప్తము, జగత్తున వ్యాప్తమునైన బ్రహ్మమే సర్వవేదములందును ప్రాప్యమై యున్నది. ఎవని మనస్సున నీ బ్రహ్మము యొక్క ప్రకటిత (యథార్థజ్ఞానము) కలుగునో ఆమనుష్యుడే యీశ్వరానందభాగి యగును. అతడే యందఱకంటె నధిక సుఖము కలవాడగును. అట్టి వాడే ధన్యుడు.

8) ఈ లోకమున మిక్కిలి ప్రేమ, ధర్మాత్మత, విద్య, సత్సంగతి, సువిచారత, నిర్వైరత, జితేంద్రియత, కలిగి ప్రత్యక్షాది ప్రమాణముల మూలమున పరమాత్మనెఱిగి యతని నాశ్రయించు మనుష్యుడు మిక్కిలి భాగ్యశాలి. కారణమేమన అతడు సత్యవిద్య వలన సర్వదుఃఖముల నుండి విడివడి, పరమానందస్వరూపుడు- పరమాత్ముని నిత్యసంగమను మోక్షమును - పొందును. మరల నెన్నడు జన్మమరణాది దుఃఖసాగరమున బడడు. విషయలోలుడు, విచారరహితుడు, విద్యారహితుడు, అధార్మికుడు. జితేంద్రియుడు కానివాడు, సత్సాంగత్యము లేనివాడు, ఛల, కపట, అభిమాన దురాగ్రహాది దుష్టగుణయుక్తుడునైన వాడు మోక్షసుఖమును బొందడు. కారణమేమన అతడు ఈశ్వర భక్తికి విముఖుడు.

అతడు జన్మమరణజ్వరాది దుఃఖములచే పీడితుడై యెల్లప్పుడు దుఃఖసాగరమునందే పడియుండును.

దీనింబట్టి పరమేశ్వరునకు, అతని యాజ్ఞలకును విరుద్ధముగా నుండకుండుట మానవులకు ఉచితమగును. మఱియు నీశ్వరపరులై వాని యాజ్ఞాతత్పరులై యైహికాముష్మిక సుఖములను సిద్ధింపజేసి కొనవలయును. ఇదియే మనుష్యులకు కృతకృత్యత యగును.

ఈ యార్యాభివినయ గ్రంథమున వేదమంత్రములకు ముఖ్యముగా పరమేశ్వరునకు సంబంధించిన యొక యర్థమే సంక్షేపముగా వ్రాయబడినది. రెండర్థములు వ్రాయుటవలన గ్రంథము పెద్దది యగును. అందువలన వ్యవహార విద్యకు సంబంధించిన యర్థము వ్రాయలేదు. కాని వేదభాష్యమునందు విస్తారపూర్వకముగ నున్నది యున్నట్లు వ్యవహారమునకు పరమార్థమునకు రెండింటికి సంబంధించిన అర్థములు సప్రమాణముగ వ్రాయబడును.

ఉదా:— "తదేవాగ్ని స్తదాదిత్య స్తద్వాయుః...." మున్నగునవి యజుర్వేద సంహితా ప్రమాణములు, "ఇంద్రం మిత్రం వరుణమ్ ............"మున్నగునవి ఋగ్వేద సంహితా ప్రమాణములు, "బృహస్పతిర్ వై బ్రహ్మ" "గణపతిర్ వై బ్రహ్మ" ''ప్రాణో వై బ్రహ్మ'' ''ఆపో వై బ్రహ్మ'' ''బ్రహ్మ హ్యగ్నిః'' మున్నగునవి శతపథ - ఐతరేయ - బ్రాహ్మణాది ప్రమాణములు, మహాన్త మేవాత్మానమ్'' మున్నగునవి నిరుక్తాది ప్రమాణములు. ఇందలి అగ్నిమున్నగు పదములకు పరబ్రహ్మమే యర్థము చేయబడినది. ''ముఖా దగ్ని రజాయత''

మున్నగు యజుర్వేద సంహితా ప్రమాణములు, ''వాయో రగ్ని'' మున్నగు బ్రాహ్మణ ప్రమాణములు, "అగ్ని రగ్రణీర్ భవతి'' మున్నగు నిరుక్తప్రమాణములు- వీనిలోని అగ్నిపదమునకు ప్రత్యక్షముగా గ్రహింపబడు రూపగుణము గలిగి దాహకశక్తి యుక్తమగు భౌతిక - అగ్నియే యర్థముగా చెప్పబడినది. ఇట్టి దృఢప్రమాణములు యుక్తులు ప్రత్యక్షవ్యవహారము నను వాని సాహాయ్యముతో రెండు విధములగు అర్థములు వేద భాష్యమునందు వ్రాయబడును. అందువలన సాయణాదికృత భాష్యదోషములు, సాయణాదులననుసరించి ఆంగ్లేయులచే వ్రాయబడిన దోషములు కారణముగా నేర్పడిన వేదముల కళంకము దూరముచేయబడును. ఇట్లు వేదముల సత్యార్థ ములు ప్రకటమగును. వేదమహత్త్వము గుర్తింపనగును. అట్లే వేదముల యనంతార్థములను గ్రహించుటవలన మానవు లకు మిక్కిలి లాభముకలుగును. వేదములందెల్లరకు ప్రీతి యేర్పడును.

ఈగ్రంథమువలన మనుష్యులకు ఈశ్వరస్వరూపజ్ఞానము అతని యెడభక్తి, ధర్మనిష్ఠ, వ్యవహారశుద్ధి మున్నగు ప్రయో జనములు సిద్ధించును. అందువలన మనుష్యులు నాస్తికులు కాక, పాషండమతములలో చిక్కువడక బాగుపడుదురు. మనుష్యులుత్తము లయినందున వారిపై సర్వశక్తిమంతుడగు జగదీశ్వరునకు కృపగలుగును. మనుష్యులును దౌష్ట్యమును విడిచి శ్రేష్ఠతను స్వీకరింతురు. ఇదియే నేను పరమేశ్వరుని ప్రార్థించునది. పరమేశ్వరుడు నాప్రార్థనను తప్పక పూర్ణము చేయును.

ఉపక్రమణిక సమాప్తము

# ప్రథమ ప్రకాశము

## ( ప్రార్థన )

ఓమ్ శంనో మిత్రః శం వరుణః శంనో భవత్వర్యమా
శం న ఇంద్రో బృహస్పతిః శంనో విష్ణురురుక్రమః" 1
ఋ- 1-6-18-4

శబ్దార్థము - ఓమ్=ఓరక్షక ! నీవు ఎల్లరకు, మిత్రః= మిత్రుడవు, అట్టినీవు, నః = మాకు, శం = కల్యాణకరుడ వగుము- వరుణః = నీవు సర్వశ్రేష్ఠుడవు, కావున, నః = మాకు, శం = సుఖదాయకుడవగుము- నీవు, అర్యమా= ధర్మాత్ములనాదరించు ధర్మరాజవు. కావున, నః= మాకు, శం= న్యాయయుక్త సుఖమునిచ్చువాడవు, భవ = అగుము, నీవు, ఇంద్రః= పరమైశ్వర్యశాలివి- నః = మాకు, శం = ఐశ్వర్య యుక్త సుఖమునిమ్ము - నీవు, బృహస్పతిః= గొప్పపదార్థము లను- గొప్పవారిని పాలించువాడవు; గొప్పసుఖములనిచ్చు వాడవు నీవే. ఉరుక్రమః= గొప్పపరాక్రమము కలవాడవు, విష్ణుః= సర్వవ్యాపకుడవు- అట్టి నీవు, నః= మాకు, శం= శాంతి దాయకుడవు (భవ=అగుము.)

దయానందస్వామి వ్యాఖ్యానము :—

ఓ సచ్చిదానందానంతస్వరూప! ఓ నిత్య శుద్ధముక్త స్వభావ! ఓ యద్వితీయానుపమ జగదాదికారణ! ఓ అజ! నిరాకార! సర్వశక్తిమంత! న్యాయకారీ! ఓజగదీశ! సర్వజగదుత్పాదకాధార! ఓ సనాతన! సర్వమంగళమయ! సర్వస్వామీ! ఓకరుణాకర అస్మత్పితా! పరమసహాయక! ఓ సర్వానందప్రద! సకలదుఃఖవినాశక! ఓయవిద్యాంధకార నిర్మూలక! విద్యార్క ప్రకాశక! ఓపరమైశ్వర్యప్రదాయక! సామ్రాజ్యప్రసారక! ఓ యధమోద్ధారక! పతితపావన! మాన్యప్రద! ఓ విశ్వవినోదక! వినయ విధిప్రద! విశ్వాస విలాసక! ఓనిరంజన! నాయక! శర్మద! నరేశ! నిర్వికార! ఓ సర్వాంతర్యామీ! సదుపదేశక! మోక్షప్రద! ఓ సత్యగుణాకర! నిర్మల! నిరీహ! నిరామయ! నిరుపద్రవ! దీనదయాకర! పరమసుఖదాయక! ఓ దారిద్ర్య వినాశక! నిర్వైర విధాయక! సునీతివర్ధక! ఓ ప్రీతిసాధక! రాజ్యవిధాయక! శత్రు వినాశక! ఓ సర్వబలదాయక! నిర్బల పాలక! ధర్మసుప్రాపక! ఓ యర్థసుసాధక! సుకామ వర్ధక! జ్ఞానప్రద! ఓ సంతపాలక! ధర్మసుశిక్షక! రోగవినాశక! ఓ పురుషార్థ ప్రాపక! దుర్గుణనాశక! సిద్ధిప్రద! ఓ సజ్జన సుఖద! దుష్టసుతాడన! గర్వకుక్రోధకులోభవిదారక! ఓ పరమేశ! పరేశ! పరమాత్మా! పరబ్రహ్మ! ఓ జగదానందక! పరమేశ్వర! వ్యాపక! సూక్ష్మచ్ఛేద్య! ఓ యజరామృతాభయ నిర్బంధనానాదీ! ఓ యప్రతిమ ప్రభావ! నిర్గుణాతుల! విశ్వాద్య! విశ్వవంద్య! విద్వద్విలాసకేత్యాద్యనంత విశేషణ వాచ్య! ఓ మంగళప్రదేశ్వర! నీవు సర్వ విధముల నెల్లరకు

మిత్రుడవు. మాకు సత్యసుఖము నిచ్చువాడ వెల్లపుడు నగుము, ఓ సర్వోత్కృష్ట! స్వీకరణీయ! సర్వేశ్వర! నీవు వరుణుడవు. ఎల్లరికంటె పరమోత్తముడవు. నీవు మాకు పరమసుఖదాయకుడ వగుము. ఓ పక్షపాతరహిత! ధర్మ న్యాయకారీ! నీవు అర్యముడవు, ధర్మరాజవు, మాకు న్యాయ యుక్తసుఖము నొసంగు వాడవు నీవే. ఓ పరమైశ్వర్య వంతుడా! ఇంద్రా! ఈశ్వర! నీవు మాకు పరమైశ్వర్య యుక్తము, స్థిరమునగు సుఖమును శీఘ్రముగా నొసంగుదువు గాక! ఓ మహావిద్య! వాచోఽధిపతీ, పరమాత్మా! నీవు బృహ స్పతివి, మాకు సర్వసుఖములకంటె నుత్తమమగు మోక్ష సుఖము నిచ్చువాడవు నీవే. ఓ సర్వవ్యాపక! అనంతపరమే శ్వర! నీవు విష్ణువవు. మాకు అనంత సుఖమును ప్రసాదిం పుము. మేమేది యడిగినను నిన్నె యడుగుదుము. సర్వ సుఖముల నిచ్చువాడవు నీవే. మఱియొకడు లేడు. అన్ని విధముల నీవే మాకాశ్రయము. అన్యుని మేమాశ్రయింపము. సర్వశక్తిమంతుడవు, న్యాయకారివి, దయామయుడవు, నెల్లరి కంటె పెద్ద తండ్రివియైన నిన్ను విడిచి నీచుల నెన్నడు మేమాశ్రయింపము. అంగీకృతుని, శరణుజొచ్చిన వానిని విడువ కుండుట నీ స్వభావము. అందువలన నీవు మాకెల్లప్పుడు సుఖము నిత్తువు. ఇది మాదృఢనిశ్చయము.

---

1. ఞిమిదా స్నేహనే. ఈ (భ్వాదిగణ) ధాతువుతో మిత్ర శబ్దమేర్పడును. (మేద్యతే స్నిహ్యతి స్నిహ్యతే వా స మిత్రః). స్నేహించువాడు, స్నేహింపబడువాడు మిత్రుడన బడును.

2. వృఞ్ వరణే. (స్వాదిగణము). వరుణః- శిష్టులను, ముముక్షువులను, ధర్మాత్ములను వరించువాడు; లేక అట్టివారిచే వరింపబడువాడు వరుణుడనబడును.

3. "ఋ గతిప్రాపణయోః (భ్వాదిగణము.) మాఙ్ మానే- (జుహోత్యాది.) ఈ రెండు ధాతువులతో అర్యమా,'శబ్ద మేర్పడును. 'యోఽర్యాన్ స్వామినో న్యాయాధీశాన్ మిమీతే మాన్యాన్ కరోతి సోఽర్యమా.' న్యాయాధీశులను మాన్యులనుగా జేయువాడు అర్యముడు.

4. ఇది పరమైశ్వర్యే (భ్వాదిగణము). ఈ ధాతువుతో ఇంద్ర శబ్దమేర్పడును. "య ఇన్దతి పరమైశ్వర్యవాన్ భవతి స ఇన్ద్రః. పరమైశ్వర్యవంతుడు.

5. బృహత్పూర్వక 'పా రక్షణే' (అదాదిగణము) ధాతువుతో బృహస్పతి శబ్దమేర్పడును. 'బృహతామాకాశాదీనాం పతిః స్వామీ,' గొప్పవి యగు నాకాశాదులను పాలించువాడు.

6. 'ఉరుర్ మహాన్ పరాక్రమో యస్య సః ఉరుక్రమః మహాపరాక్రమముకలవాడు.

7. "విష్ల్ వ్యాప్తౌ (జుహోత్యాది గణము) ఈ ధాతువుతో విష్ణుశబ్ద మేర్పడును. 'వేవేష్టి వ్యాప్నోతిచరాచరం జగత్ స విష్ణుః' సర్వజగత్తును వ్యాపించియుండు వాడు విష్ణువు.

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ అగ్ని మీళే పురోహితం యజ్ఞస్య
దేవ మృత్విజమ్, హోతారం రత్నధాతమమ్." 2.
ఋ-1-1-1-1.

శ.-అ.- (నేను) పురోహితం= సర్వజగత్తునకు హితము సేయువాడు, యజ్ఞస్య దేవమ్ = యజ్ఞమునకు ప్రకాశకుడు, పూజ్యతముడు, ఋత్విజమ్ = వసంతాది ఋతుజనకుడు, హోతారమ్ = ప్రళయకాలమున జగత్తును ప్రకృతియందు హోమముచేయువాడు, రత్నధాతమమ్= రమణీయములగు పృథివ్యాది లోకములను ధరించువాడు, భక్తులకు రత్నముల నొసంగువాడు, అగ్నిమ్= సర్వోన్నతిసాధకుడు నగు పరమేశ్వరుని, ఈళే = స్తుతియింతును.

ద. వ్యాఖ్యానము :—

'మానవుల నెల్లర నుద్దేశించి పరమేశ్వరు డిట్లు ఉపదేశించుచున్నాడు :—

"ఓ మనుష్యులార! మీరు నాస్తుతి ప్రార్థనోపాసనాదు లీవిధముగ జేయుడు. తండ్రి తన కుమారులకు తన విషయమునను, గురువుల విషయమునను మీరిట్లు స్తుతి ప్రార్థనాదులు చేయుడు అనిచెప్పునట్లు, గురువు తనశిష్యులకు తనయెడలను తల్లిదండ్రుల యెడలను ఇట్లు ప్రార్థనాదుల నొనర్పుడు. ఇట్లు

వ్యవహరింపుడు అని బోధించునట్లును ఎల్లరకు తండ్రియు పరమగురువునైన ఈశ్వరుడు కృపతో మనకు - మానవులకు సర్వవ్యవహారములను సర్వపదార్థములను గూర్చియు ఉప దేశించినాడని భావము. అందువలన మనకు సర్వవ్యవహార జ్ఞానము సర్వపదార్థముల జ్ఞానము కలిగి అత్యంత సుఖము కలుగును. అన్నింటికి ఆదికారణము ఈశ్వరుడైనట్లు పరమ విద్యయగు వేదమునకు నాదికారణ మీశ్వరుడే.

ఓ వంద్యేశ్వర ! అగ్నే ! నీవు జ్ఞానస్వరూపుడవు. నిన్ను స్తుతియింతును. ఓ సర్వహితోపకారక ! నీవు 'పురోహితమ్' పురోహితుడవు - సర్వజగత్తునకు హితముసేయువాడవు. ఓ యజ్ఞదేవ ! నీవు మనుష్యుల కెల్లరకు పూజ్యతముడవు. జ్ఞాన యజ్ఞాదుల కొఱకు కమనీయతముడవు - మిక్కిలిగా కోర దగినవాడవు. 'ఋత్విజమ్' వసంతాది సర్వఋతువులను రచించువాడవు. ప్రాణుల కెప్పుడెట్టి సుఖము కలుగవలయునో యప్పు డట్టి సుఖమును కలిగించువాడవు నీవే. 'హోతారమ్' సర్వజగత్తునకు సమస్త యోగక్షేమముల నొసంగువాడవు నీవే, ప్రళయసమయమున నీ జగత్తును ఉపాదాన కారణమగు ప్రకృతియందు హోమముచేయువాడవు నీవే. "రత్నధాత మమ్" రత్నములు పృథివ్యాది రమణీయ పదార్థములు రచించి వానిని ధరించువాడవు నీవు. నీ సేవకులకు రత్నములను ప్రసాదించువాడవు నీ వొక్కడవే. ఓ సర్వశక్తిమంతా ! పర మాత్మా ! అందువలననే నిన్ను మాటిమాటికి స్తుతించు చున్నాను. దీనిని నీవు స్వీకరింతువుగాక ! మేము నీ కృపకు పాత్రులమై యెల్లపుడు నానందింతుముగాక !

( ప్రార్థన )

ఓ౩మ్ అగ్నినా రయి మశ్నవత్ పోష మేవ
దివే దివే। యశసం వీరవత్తమమ్. 3

ఋ-1-1-1-3.

శ. అ. :- స్తుతిచేయువాడు, అగ్నినా = జ్ఞానస్వరూపుడగు పరమేశ్వరుని సహయోగముతో, దివే దివే=ప్రతిదినము, పోషమేవ = పుష్టికారకమగు, యశసమ్ = సత్కీర్తిని పెంపుచేయు, వీరవత్తమమ్=మిక్కిలి వీరులతో యుక్తుడై, రయిమ్= ధనమును, అశ్నవత్ = పొందునుగాక !

ద. వ్యాఖ్యానము :—

ఓ మహాదాత ! ఈశ్వర ! అగ్నీ ! నీ కృపవలన నిన్ను స్తుతియించు మనుష్యుడు 'రయిమ్' విద్యాది ధనమును, సువర్ణాది వస్తువులను పొందును. ఆ ధనము ప్రతిదినము 'పోషమేవ' గొప్ప పుష్టిని కలిగించుటకును సత్కీర్తిని వర్థిల్ల జేయుటకును తోడ్పడును. అందువలన విద్య, వీర్యము, ధైర్యము, చాతుర్యము, బలము, పరాక్రమము, దృఢాంగములు కలిగిన ధర్మాత్ములు, న్యాయయుక్తులు, నైన మిక్కిలి వీరపురుషులు లభింతురు. అట్లే నేనుకూడ సువర్ణము, రత్నాదులు, చక్రవర్తిరాజ్యము, విజ్ఞానస్వరూపధనమును పొందుదును గాక! నీకృపవలన నెల్లపుడు ధర్మాత్ముడనై అత్యంతసుఖమును అనుభవింతునుగాక !

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ అగ్నిః పూర్వేభిర్ ఋషిభి రీడ్యో నూతనై రుత

స దేవాఀ ఏహ వక్షతి." 4 ఋ-1-1-1-2.

శ. అ. :- అగ్నిః = ఎల్లరికి ముందునడచు జ్ఞానులకు జ్ఞానియైన పరమాత్మ, పూర్వైః=పూర్వపు, ఋషిభిః=మంత్ర ద్రష్టలగు విద్వాంసులచేతను, నూతనైః = విద్యనభ్యసించు నవీనవిద్యార్థులచేతను, ఉత = మఱియు నితరులచేతను, ఈడ్యః = స్తుతియింపదగినవాడు, సః = అతడు, ఇహ = ఈలోకమున, దేవాన్ = దివ్యగుణములను, **ఆవక్షతి = అన్ని** వైపులనుండి, అన్నివిధముల ప్రాప్తింపజేయును.

ద. వ్యాఖ్య :- ఎల్లరకు స్తుతియోగ్యుడవగు నోయగ్నీ ! ఈశ్వర ! నీవు "పూర్వేభిః" విద్యల నేర్చిన ప్రాచీన, "ఋషిభిః" మంత్రార్థముల నెఱిగిన విద్వాంసులచేతను, "నూతనైః" వేదార్థముల నభ్యసించు నవీనబ్రహ్మచారులచేతను, స్తుతి యోగ్యుడవు. 'ఉత' మఱియు విద్వాంసులమో, మూర్ఖులమో యైన మాచేతను నీవే స్తుతింపబడదగినవాడవు. అట్టి స్తుతిని పొందిన నీవు మాకుసర్వసాంసారికసుఖముల ననుభవించుటకు వలయు దివ్యగుణముల నొసంగుము. నీవే యెల్లరకు నిష్ట దేవుడవు. (4)

---

1. 'అగ్నిః కస్మాత్? అగ్రణీర్ భవతీతి (నిరుక్త 7-14-3-4)
2. "సాక్షాత్కృతధర్మాణః ఋషయః బభూవుః"(ని.1-20-2)
3. వహ ప్రాపణే (భ్వాదిగణ) ధాతువుతో 'వక్షతి' యగును

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ అగ్నిర్ హోతా కవిక్రతుః సత్య శ్చిత్రశ్రవ స్తమః
దేవో దేవేభి రాగమత్." 5 (ఋ-1-1-1-5)

శ అ. :- అగ్నిః=సర్వద్రష్టయగుపరమాత్మ, హోతా= సర్వజగత్తును హోమముచేయువాడు, కవిక్రతుః = జ్ఞానపూర్వకముగ కర్మలనొనర్చువాడు, సత్యః = నాశరహితుడు, చిత్రశ్రవ స్తమః=మిక్కిలి విచిత్రమైన కీర్తిగలవాడు, దేవః = దివ్యగుణయుక్తుడు, దేవేభిః=దివ్యగుణములతో, ఆ అగమత్= అంతట ప్రకాశించుచున్నాడు. (5)

ద.వ్యా.: "ఓ సర్వద్రష్టా! నీవు 'క్రతుః' సర్వజగత్తునకుజనకుడవు. 'సత్యః' అవినాశివి-ఎన్నడును నాశము నొందనివాడవు. 'చిత్రశ్రవ స్తమః' ఆశ్చర్యకరములగు శ్రవణాదిశక్తులు, ఆశ్చర్యకర గుణములు, ఆశ్చర్యకరశక్తులు, ఆశ్చర్యకరస్వరూపము కలవాడవు. అత్యంత ఉత్తముడవు. నీకు సమానుడు కాని, అధికుడు కాని మఱియొకడు లేడు. ఓ జగదీశ! దివ్యగుణములతోబాటు నీవు మాహృదయములందు ప్రకటమగుము. మేము, మారాజ్యము దివ్యగుణములతోగూడి యుండునట్లు నీవెల్ల యెడల ప్రకాశింపుము. ఆరాజ్యము నీదియే. మేమును నీపుత్రులము, భృత్యులవంటివారము మాత్రమే. (5)

---

1. కవిః క్రాన్తదర్శనో భవతి'. (నిరుక్త. 12-13-1)

2. 'కరోతి యో, యేన వా స క్రతుః.
కవిశ్చాసౌ క్రతుశ్చ సః కవిక్రతుః (వేదభాష్యము)

3. 'సన్తీతి సన్తః తేషు సత్సు యత్ సాధుః తత్ సత్యమ్.' పదార్థములు 'సత్' అనబడును. వానియందు సాధు వగుటచే పరమేశ్వరుడు సత్యమనబడును,

## (ప్రార్థన)

"ఓ౩మ్ యదఙ్గ దాశుషే త్వమగ్నే భద్రం కరిష్యసి
తవేత్తత్ సత్య మఙ్గిరః" 6 (ఋ. 1-1-2-1)

శ. అ. :- హే అఙ్గ ! = ఓ మిత్రా ! హే అగ్నే ! = ఓ సర్వజ్ఞ ! హే అఙ్గిరః ! = ఓ ప్రాణప్రియ ! త్వమ్ = నీవు, దాశుషే = దాతకు, యత్ భద్రమ్=ఏశుభమును, కరిష్యసి = చేయగోరుదువో, తత్=అది, తవ=నీయొక్క, సత్యమ్ ఇత్ = సత్యస్వభావమే.

ద.వ్యా. : ఓ 'అఙ్గ !' మిత్రా! ఎవడు నీకుతనయాత్మాంతఃకరణా దుల నర్పించునో వానికి నీవు 'భద్రమ్' వ్యావహారిక, పారమార్థిక సుఖములను తప్పక కలిగింతువు. 'అఙ్గిరః !' ప్రాణప్రియుడ వగు నో ప్రభూ ! నీభక్తులకు పరమసుఖము జేకూర్చుట నీసత్య వ్రతము. ఈ నీస్వభావమే మాకత్యంతసుఖకారకము. నీవునాకు ఐహికసుఖమును పారమార్థికసుఖమును రెండిటిని శీఘ్రముగా నొసంగుము. సర్వదుఃఖములు దూరమై మేము సదా సుఖులమైయుందుముగాక ! (6)

( స్తుతి మంత్రము )

ఓ౩మ్ వాయవాయాహి దర్శతేమే సోమా అరంకృతాః,
తేషాం పాహి శ్రుధీ హవమ్." 7 (ఋ. 1-1-3-1)

శ. అ. :- అనంతబలముగల ఓ దేవ! హేదర్శత ! = ఓ దర్శనీయస్వామీ ! ఆయాహి = అన్నివిధముల మమ్ము ప్రాప్తించుము. ఓ ప్రభూ ! ఇమే సోమాః = శ్రద్ధాభక్తులతో నిర్మితపదార్థములను, అరంకృతాః = మేమలంకరించియుంచితిమో, తేషాం = వానిని, పాహి = రక్షింపుము, హవమ్ = (మా) పిలుపును, శ్రుధీః = వినుదువుగాక !

ద. వ్యా :- హేవాయో ! అనంతబలముగలపరేశా ! ఓ దర్శనీయప్రభూ ! దయతో మమ్ముచేరుము, మేము మాయల్ప శక్తితో సోమరసాదిపదార్థములను చేకూర్చితిమి; మాకుగల శ్రేష్ఠపదార్థములన్నియు నీకొఱకే యలంకరించితిమి. ఉత్తమ రీతితో నిర్మించితిమి, వానిని నీకు సమర్పించితిమి, వాని ననుగ్రహింపుము. దీనులమగు మాపిలుపు విని, పుత్రుడర్పించు చిన్నవస్తువుతో తండ్రి ప్రసన్నుడగునట్లు మాపై ప్రసన్నుడవగుదువుగాక !

(ప్రార్థన)

"ఓ౩మ్ పావకా నః సరస్వతీ వాజేభిర్ వాజినీవతీ,

యజ్ఞం వష్టు ధియా వసుః." 8 (ఋ. 1-1-6-4)

శ. అ. :- నః=మమ్ములను, పావకా=పవిత్రముచేయు, సరస్వతీ = వాణి, వాజేభిః = అన్నాదులతో, వాజినీవతీ = జ్ఞానక్రియాయుక్తమై, ధియా=బుద్ధితో, వసుః=ధనరూపమై, యజ్ఞమ్ = పూజనీయజ్ఞానమును, వష్టు=కామించుగాక!

ద. వ్యా :- ఓ వాక్పతీ! సర్వవిద్యామయ! మాకు నీకృపవలన "సరస్వతీ'' సర్వశాస్త్రవిజ్ఞానయుక్తమగు వాణి ప్రాప్తించునుగాక! 'వాజేభిః' అట్లే యుత్తమములగు అన్నాది పదార్థములతోగూడి, 'వాజినీవతీ' సర్వోత్తమక్రియా విజ్ఞాన యుక్తమై, 'పావకా' తన పవిత్రస్వరూపముతో మమ్ములను పవిత్రమొనర్చుచు ఆవాణి సత్యభాషణమయము, మంగళ కారకమునగుచు నీకృపవలన మమ్ము చేరునుగాక! 'ధియా వసుః' నీయనుగ్రహమువలననే యావాణి పరమోత్తమబుద్ధితో గూడి నిధిరూపమై, "యజ్ఞంవష్టు'' సర్వశాస్త్రబోధ్యుడవు, పూజ్యతముడవునగు నీవిజ్ఞానమును కోరునదైయుండుగాక! అందువలన మేము మామూర్ఖతనువీడి మిక్కలి పాండిత్యముతో గూడి సుఖింతుముగాక! (8)

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ పురూతమం పురూణా మీశానం వార్యాణామ్,

ఇన్ద్రం సోమే స చా సుతే." 9 (ఋ. 1-1-9-2)

శ. అ. :- ఓ జీవ ! పురూణామ్ = శ్రేష్ఠులలో, పురూతమమ్ = మిక్కిలి శ్రేష్ఠుడు, వార్యాణామ్ = వరింపదగిన పదార్థములకు, ఈశానమ్ = స్వామియునగు, ఇంద్రమ్ = పరమేశ్వరుని, సుతే = జగత్తునందు, సోమే = శాంతికొఱకు, సచ + ఆ = సమవేతుడవగుము.

ద. వ్యా. :- ఓ పరాత్పర ! పరమాత్మా ! నీవు ''పురూతమమ్'' అత్యన్తోత్తముడవు, సర్వశత్రువినాశకుడవు 'ఈశానమ్' బహువిధములగు జగత్పదార్థములకు స్వామివి; ఉత్పాదకుడవు. 'వార్యాణామ్' వరణీయములగు పరమానందాది పదార్థములకును ఈశుడవు. 'సోమే' ఉత్పత్తిస్థానమగు నీప్రపంచము నీవలన 'సుతే' ఉత్పన్నమగుటవలన, 'సచా' ప్రీతిపూర్వకముగ, 'ఇన్ద్రమ్' పరమైశ్వర్యవంతుడవగు నిన్ను 'అభిప్రగాయత' హృదయమున నత్యంతప్రేమతో గానముచేయవలయును. శక్త్యనుసారము స్తుతిచేయవలయును. స్వామీ ! నీకృపవలన మాయైశ్వర్యము వర్ధిల్లుగాక! మేము పరమానందమును పొందుదుముగాక !

( స్తుతి మంత్రము )

ఓ౩మ్ తమీశానం జగత స్తస్థుషస్పతిం

ధియం జిన్వ మవసే హూమహే వయమ్

పూషా నో యథా వేదసా మసద్ వృధే

రక్షితా పాయు రదబ్ధః స్వస్తయే." 10

(ఋ.1-15-5)

శ. అ. :- వయమ్ = మేము, జగతః = జంగమము, తస్థుషః = స్థావరమునగు జగత్తునకు, పతిం = పాలించునట్టియు, ధియం జిన్వమ్ = బుద్ధిని ప్రేరేపించునట్టియు, తమ్ ఈశానమ్ = ఆపరమేశుని, అవసే = రక్షణకొఱకు, హూమహే = ఆహ్వానించుచున్నాము, పూషా = సర్వపోషకుడగునా ప్రభువు, నః=మా, వేదసామ్=ధనముల, యథా వృధే = వృద్ధియెట్లగునో, అట్లు, రక్షితా = రక్షకుడు, అసత్= అగుగాక !, అదబ్ధః = ఎవరికిని లొంగని, పాయుః=రక్షకుడు నగు పరమేశ్వరుడు, స్వస్తయే = మాకల్యాణముకొఱకు, అసత్ = అగుగాక !

ద. వ్యా. ఓ సర్వాధిస్వామీ ! నీవే యీచరాచర జగత్తునకు 'ఈశానమ్' నిర్మాతవు. 'ధియంజిన్వం' సర్వవిద్యామయము,

విజ్ఞానస్వరూపమునగు బుద్ధిని ప్రకాశింపజేయువాడవు నీవే, నీవెల్లరను తృప్తిపఱతువు. ప్రీణనీయస్వరూపుడవు. 'పూషా' సర్వపోషకుడవు-అట్టి నిన్ను 'నః అవసే' మారక్షణకొఱకు 'హూమహే' ఆహ్వానించుచున్నాము, 'యథా' నీవు మావిద్యాది ధనములను వృద్ధిపఱచుటకును.వానిని రక్షించుటకును 'అదబ్ధః రక్షితా' అలసతలేనివాడవై యెట్లు రక్షించుటకు తత్పరుడవై యున్నావో, అట్లే దయతో నీవు 'స్వస్తయే' మాస్వస్థతకొఱకు 'పాయుః' నిరంతర రక్షకుడవైయున్నావు. నీచే పాలితులమగు మేము ఎల్లప్పుడు ఉత్తమకర్మల నొనర్చుచు ఉన్నతిని పొంది ఆనందము ననుభవింతుముగాక ! (10)

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ అతో దేవా అవంతు నో యతో విష్ణుర్ విచక్రమే
పృథివ్యాః సప్త ధామభిః." 11

(ఋ. 1-5-22-16)

శ. అ. :- యతః=ఏసామర్థ్యముతో, విష్ణుః = వ్యాపక పరమేశ్వరుడు, పృథివ్యాః = పృథివియొక్క, సప్తధామభిః= సప్తధామములతో, విచక్రమే = వివిధసృష్టినిరచించునో, దేవాః ! = ఓ విద్వాంసులార ! అతః = దానితో, ఆసామర్థ్యముతో, నః = మమ్ములను, అవన్తు = రక్షింతురుగాక !

ద. వ్యా. ;- 'హేదేవాః' ! ఓ విద్వాంసులార ! 'విష్ణుః' సర్వవ్యాపకపరమేశ్వరుడు, జీవులుపాపపుణ్యఫలముల ననుభ

వించుటకును, సర్వపదార్థముల స్థితికొఱకును పృథివిమొదలు 'సప్త' సప్తవిధధామములను - ఊర్ధ్వలోకముల నేడింటిని, అధోలోకముల నేడింటిని, అట్లే గాయత్రిమున్నగు సప్తఛందస్సులతోగూడిన వేదవిద్యను రచించెను, ఆలోకములలోనుండు వ్యాపకపరమేశ్వరుడు 'యతః' ఏసామర్థ్యముతో నాలోకములను రచించెనో 'అతః' అసామర్థ్యముతోనే మనలను రక్షించును గాక! అవిష్ణువుయొక్క ఉపదేశముతోనే విద్వాంసులార! మీరును మమ్ము రక్షింపుడు. వివిధరూపముల నీజగత్తును రచించు నావిష్ణువును నిత్యము భక్తితో సేవింపుడు.

( ప్రార్థన )

"ఓ౩మ్ పాహి నో అగ్నే రక్షసః పాహి ధూర్తే రరాష్ణః

పాహి రీషత ఉత వా జిఘాంసతో బృహద్భానో

యవిష్ఠ్య." 12 (ఋ॰ 1-8-36-15)

శ. అ. :- అగ్నే! = శత్రుదాహకప్రభూ! నః=మమ్ములను, రక్షసః = రాక్షసులనుండి, పాహి = రక్షించుము, అరాష్ణః=కృపణులనుండి, ధూర్తేః=వంచకులనుండి, పాహి= రక్షింపుము, రీషతః = హింసచేయువారినుండి, ఉతవా = మఱియు, జిఘాంసతః = మమ్ము హింసింపదలచువానినుండియు, బృహద్భానో! = ఓమహాతేజస్వీ!, యవిష్ఠ్య! = సర్వాధికబలవంతా!, పాహి = మమ్ము రక్షింపుము.

ద, వ్యా :- ఓ సర్వశత్రుదాహక పరమేశ్వర! రాక్షసుల సుండియు, హింసాశీలురగు దేహధారులనుండియు 'నః' 'పాహి' మమ్ము రక్షింపుము. 'ధూర్తైరరావ్ణః' దానబుద్ధిలేని కృపణులనుండియు వంచకులనుండియు మమ్ము కాపాడుము. మమ్ము చంపునట్టియు, చంపగోరునట్టియు దుష్టులనుండియు ఓ మహాతేజస్వి! బలవత్తమ! మమ్ము రక్షింతువుగాక!

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ త్వ మస్య పారే రజసో వ్యోమనః స్వభూత్యోజా
అవసే ధృషన్మనః,
చకృషే భూమిం ప్రతిమాన మోజసోఽపః స్వః
పరిభూరేష్యా దివమ్." 13 (1-10-52-12)

శ. అ. :- ఓప్రభూ!. త్వమ్ = నీవు, అస్య రజసః = ఈలోకమునకు, వ్యోమనః = ఆకాశమునకు, పారే= అవతల జగత్తునందంతటను, స్వభూత్యోజాః = నిజైశ్వర్యరూపమగు నోజస్సుతో సంపన్నుడవైయున్నావు. కావున పాపుల, మనః = మనస్సును, అవసే = ధార్మికులను రక్షించుటకు, ధృషత్ = తిరస్కరించుచున్నావు, ఓజసః=నీఓజస్సునకు, ప్రతిమానం= బోధకమగు, భూమిమ్ = భూమిని, అపః = జలమును,

అంతరిక్షమును, స్వః = మోక్షానందమును, దివమ్ = ద్యులోకమును, ఆ = అన్నివైపులనుండి, పరిభూః ఏషి = వ్యాపకుడవగుచు, చకృషే = రచించుచున్నావు.

ద, వ్యా. :- పరమైశ్వర్యశాలివగునోపరమాత్మా! ఆకాశలోకమునకు లోపల వెలుపల స్వకీయమగునైశ్వర్యముతోను, బలముతోను విరాజిల్లుచు నీవు దుష్టులమనస్సును ధర్షణ చేయుచున్నావు - తిరస్కరించుచున్నావు. సర్వజగత్తును, ముఖ్యముగా మమ్ము 'అవసే' రక్షించుటకు, 'త్వమ్' ప్రభూ! నీవు జాగరూకుడవై యున్నావు. అందువలననే మేము నిర్భయులమై ఆనందించుచున్నాము. మఱియు, 'దివమ్' పరమాకాశమును 'భూమిమ్' భూమిని, "స్వః' సుఖవిశేషమును నీసామర్థ్యముచేతనే రచియించి యథాయోగ్యముగ పాలించుచున్నావు. 'పరిభూః ఏషి' సర్వోపరివర్తించుచు నెల్లరకు లభించుచున్నావు. 'ఆదివమ్' ద్యోతనాత్మకములగు సూర్యాదిలోకములయు, 'అపః' అంతరిక్షముయొక్కయు, జలము మున్నగువానియొక్కయు పరిమాణ కర్తవు నీవే. నీవు స్వయముగా నపరిమేయుడవు, భగవన్! దయతో నీవు మాకు నీయొక్కయు సృష్టియొక్కయు విజ్ఞానమును కలిగింపుము.

(ప్రార్థన)

"ఓ౩మ్ విజానీహ్యార్యాన్ యే చ దస్యవో
బర్హిష్మతే రన్ధయా శాస దవ్రతాన్
శాకీ భవ యజమానస్య చోదితా
విశ్వేత్తా తే సధమాదేషు చాకన." 14

(ఋ. 1-10-51-8)

శ. అ. :- ఓరక్షక! ఆర్యాన్=ఆర్యులను, యే చదస్యవః= ఎవరు దస్యులో వారిని, విజానీహి=నీవెఱుగుదువు, బర్హిష్మతే= యజ్ఞకర్తకొఱకు, అవ్రతాన్ = వ్రతరహితులను, శాసత్ = శిక్షించుచు, రన్ధయ = సరిచేయుము, యజమానస్య = యజమానునకు, శాకీ = శక్తిదాతవు, చోదితా = ప్రేరకుడవు, భవ= అగుము, తే = నీయొక్క, తా విశ్వా ఇత్ = ఆయగ్ని, సధమాదేషు = సమానసుఖసాధనములందు, చాకన = నేను కోరుచున్నాను.

ద, వ్యా. :- యథాయోగ్యముగ నెల్లరనెఱుగునోస్వామీ! 'ఆర్యాన్' విద్యాధర్మాద్యుత్కృష్ట స్వభావాచరణయుక్తులైన ఆర్యుల నెఱుగుదువు. 'యే చ దస్యవః' నాస్తికులు, చోరులు, బందిపోటు దొంగలు, విశ్వాసఘాతుకులు, మూర్ఖులు, విషయలంపటులు, హింసాదిదోషయుక్తులు ఉత్తమకార్యములందు

విఘ్నములు కలిగించువారు, స్వార్థులు, స్వార్థసాధనతత్పరులు, వేదవిద్యావిరోధులు, అనార్యులు, 'బర్హిష్మతే' సర్వోపకారకములగు యజ్ఞములను ధ్వంసముచేయువారునైన దుష్టమానవులనెల్లరను నీవు, 'రంధయ' సమూలముగ నశింపజేయుము. 'శాసదవ్రతాన్' బ్రహ్మచర్యాద్యాశ్రమ ధర్మముల ననుష్ఠింపక వేదమార్గము నుచ్ఛిన్నమొనర్చు అనాచారులను యథాయోగ్యముగ దండింపుము. అందువలన వారు సంస్కరింపబడి శిష్టులగుదురు. లేక ప్రాణాంతదండార్హులై ప్రాణముల గోల్పోవుదురు. లేక మావశముననైన ఉందురు. 'శాకీ' నీవు పరమ శక్తియుక్తుడవు. జీవునకు శక్తినొసంగుటకును, ఉత్తమకర్మల నొనర్చుటకు వలయు ప్రేరణ నొసంగువాడవు. మఱియు నీవు మేమొనర్చు దుష్టకార్యములను నిరోధించువాడవు. నేను కూడ 'సధమాదేషు' ఉత్కృష్టస్థానములందు నివసించుచు, 'విశ్వేత్తాతే' నీయాజ్ఞానుకూలములగు నుత్తమకార్యములను, 'చాకన' కోరుదును. హేప్రభో! వానిని నీవు పూర్ణము-సఫలము చేయుము.

---

1. ప్రశస్తః శాకః=శక్తిః విద్యతే యస్య స శాకీ.

2. ఆర్యః=ఈశ్వరపుత్రః (నిరుక్త 6-26-1)

3. దస్యుం దాసయితారం (నిరుక్త 6-?6-1) దసు ఉపక్షయే (దివాదిగణ) తన జుగుప్సిత కర్మలతో ప్రజలకు హానిచేయువాడు.

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ న యస్య ద్యావా పృథివీ అను వ్యచో

న సిన్ధవో రజసో అన్త మానశుః

నోత స్వవృష్టిం మదే అస్య యుధ్యత

ఏకో అన్య చ్చకృషే విశ్వమానుషక్." 15

(ఋ. 1-10-52-14)

శ. అ. :- ఓపరమేశ్వర !, యస్య = ఏ నీయొక్క, అనువ్యచః = వ్యాపకతయొక్క, అన్తమ్ = అంతమును, ద్యావాపృథివీ = ద్యుపృథివీలోకములు, న అనశుః = పొందలేవు, సింధవః = సముద్రములు, రజసః = లోకలోకాంతరములు, అంతం న ఆనశుః = అంతమును పొందలేవు. ఉత= మఱియు, మదే = మదించినవానివలె, స్వవృష్టిం = తన వృష్టితో, యుద్ధ్యతః = యుద్ధముచేయు, అస్య=ఈ మేఘము కూడ, న = నీయంతము నెఱుగనేరదు, ఏకః = నీవొక్కడవే, అన్యత్ అనుషక్ = నీకంటె భిన్నమై నీతో అనుషక్తమైయున్న విశ్వమును, చకృషే = రచించుచున్నావు.

ద. వ్యా. :- ఓ పరమైశ్వర్య యుక్తేశ్వర! నీవింద్రుడవు. ఓ మానవులార! పరమాత్మని యంతము - పరిమాణమును ఎవడును ఎఱుగడు. ద్యులోకముననుండు సూర్యాదిలోకములు

కాని, సర్వోపరివర్తిల్లు ఆకాశముకాని, పృథివికాని, అంతరిక్షమున నుండు నితర క్షుద్రలోకములు కాని, యేవియు పరమేశ్వరుని యంతము నెఱుంగజాలవు. అతడంతట నన్నింట అనుస్యూతుడై-పరిపూర్ణుడై యున్నాడు. 'న సింధవః' అంతరిక్షముననుండు దివ్యజలసింధువులు, లోకములు నతని యంతమును బొందజాలవు. 'నోత స్వవృష్టిం మదే' వృష్టి ప్రహారములతో యుద్ధమొనర్చువృత్రుడు - మేఘము ఉఱుములు మెఱపులు నేవియు నీశ్వరుని యంతము నెఱుగనేరవు. నీపారము నెవరెఱుగగలరు ? "ఏకః" నీవు ఒక్కడవే యెవరి సాహాయ్యము కోరకయే నీకంటె భిన్నమైన 'విశ్వమ్' విశ్వమును, 'అనుషక్' అనుషక్తుడవై-నీవందు వ్యాప్తుడవైయుండి 'చకృషే' రచించియున్నావు. అట్టి యీ జాగతిక పదార్థములు నీపారము నెట్లుపొందగలవు ? 'అన్యత్' మఱియు నీవెన్నడును జగద్రూపమును బొందవు. నీనుండి యీ జగత్తును రచింపవు. నీయనంత సామర్థ్యముతో నీజగత్తును సృష్టించి పోషించి లయమొనర్చుచున్నావు. అట్టి నీసాహాయ్యము మాకెల్లపుడు లభించునుగాక !

( ప్రార్థన )

"ఓ౩మ్ ఊర్ధ్వో నః పాహ్యంహసో ని కేతునా
విశ్వం సమత్రిణం దహ,
కృధీ న ఊర్ధ్వాన్ చరథాయ జీవసే
విదా దేవేషు నో దువః." 16

(ఋ. 1-8-36-14)

శ. అ.:- ఓదేవ !, నీవు ఊర్ధ్వః=సర్వోత్కృష్టుడవు, నః= మమ్ము, కేతునా = జ్ఞానముతో, అంహసః = పాపమునుండి, నిపాహి = అన్నివిధముల రక్షింపుము - దూరముగనుంచుము. అట్లే, విశ్వం = ప్రపంచమును రక్షింపుము, అత్రిణం = రాక్షసుని-సర్వభక్షుని, సందహ = బాగుగ దహింపుము, నః= మమ్ములను, చరథాయ=విచరించుటకు, జీవసే = జీవనము కొఱకు, ఊర్ధ్వాన్ = ఉన్నతులను, కృధీ = చేయుము, నః= మా, దువః = సేవను, దేవేషు = దేవతలందును, నిష్కాము లైన జ్ఞానులందును, విదాః = ప్రాప్తింపజేయుము.

ద, వ్యా. :- సర్వోపరి విరాజమానమగు నో బ్రహ్మమా ! నీవు 'ఊర్ధ్వః' ఉత్కృష్టుడవు, మమ్మును దయతో ఉత్కృష్ట

గుణవంతులం జేయుము. అట్లే ఊర్ధ్వదేశముననుు మమ్ము రక్షింపుము. ఓ సర్వపాప ప్రణాశకేశ్వర! ఘుమ్ము, 'కేతునా' విజ్ఞానము-వివిధ విద్యాదానముచేసి 'అంహసః' అవిద్యాది మహాపాపములనుండి 'నిపాహి' పూర్తిగా రక్షింపుము-ఎల్లప్పుడు దూరముగా నుంచుము. అట్లే 'విశ్వమ్' ఈ సకలప్రపంచమును నిత్యము పాలించుము. ఓ సత్యమిత్రా! న్యాయకారీ! 'అత్రిణమ్' మమ్ము ద్వేషించువానిని, కామక్రోధాది శత్రువులను నీవు 'సందహ' బాగుగ భస్మీభూతమొనర్పుము. 'కృధీన ఊర్ధ్వాన్' ఓ కృపానిధీ! విద్య, శౌర్యధైర్యములు, బలపరాక్రమములు, చాతుర్యము, వివిధ ధనములు, ఐశ్వర్యము, వినయము, సామ్రాజ్యసంపత్తి, సంప్రీతి, స్వదేశ సుఖసంపాదనము మున్నగు గుణములందు మమ్ము ఇతర నరదేహధారులందఱకంటె నధికోత్తములం జేయుము. 'చరథాయ జీవసే' అందఱకంటె నధికమగు నానందభోగము, సర్వదేశములందును నవ్యాహత గమనాగమనములు, ఆరోగ్యవంతమగు దేహము, శుద్ధమానసజలము, విజ్ఞానాదుల కొఱకు మమ్ము ఉత్తములంజేసి నీరక్షణతోగూడిన వారలం జేయుము. 'విదాః' విద్యాది ఉత్తమోత్తమ ధనమును 'దేవేషు' విద్వాంసులకు జేకూర్చుము. విద్వాంసుల మధ్య మమ్ము ఉత్తమప్రతిష్ఠాయుక్తులంజేసి కాపాడుము.

( ప్రార్థన )

'ఓ౩మ్ అదితిర్ ద్యౌ రదితి రన్తరిక్ష
మదితిర్ మాతా స పితా స పుత్రః
విశ్వేదేవా అదితిః పఞ్చజనా
అదితిర్ జాత మదితిర్ జనిత్వమ్." 17
(ఋ. 1-14-89-10)

శ. అ. :- అదితిః = అఖండేశ్వరుడు, ద్యౌః = సదా ప్రకాశించువాడు, అదితిః=అవినాశి, అంతరిక్షమ్=అందఱిలో రమించుచున్నాడు, అదితిః = సర్వాంతర్యామి, మాతా = జగన్మాత – మోక్షదాత, సః = అతడు, పిత = జగత్పిత, సః = అతడు, పుత్రః = పవిత్రముచేయువాడు, విశ్వేదేవాః= అతని దివ్యగుణములన్నియు, అదితిః = అఖండనియములు, పంచజనాః = పంచప్రాణములు, పంచవిధసృష్టి, అదితిః = అఖండనియములు, అదితిః=ఆ యఖండపరమాత్మ, జాతమ్= సుప్రసిద్ధము, జనిత్వమ్ = అన్నింటికి జన్మలకు హేతువు.

ద. వ్యా :- ఓ త్రైకాలాబాధ్యేశ్వర! 'అదితిర్ ద్యౌః' నీవెల్లప్పుడు వినాశరహితుడవు; స్వప్రకాశస్వరూపుడవు. 'అదితి రంతరిక్షమ్' అవికృతుడవు, ఎల్లరకు నధిష్ఠాతవు, 'అదితిర్ మాతా' నీవు ముక్తజీవులకు నిత్యసుఖము నిచ్చి, యత్యంత

మానము నొసంగుదువు, 'స పితా' అవినాశి స్వరూపులమగు మాకు జనకుడవు-పాలకుడవు. 'స పుత్రః' ముముక్షువులను, ధర్మాత్ములను, విద్వాంసులను నరకాది దుఃఖములకు దూరముగా నుంచి పవిత్రులంజేసి రక్షించువాడవు. 'విశ్వేదేవా అదితిః' విశ్వధారణము, విశ్వరచన, పాలనము, మారణము మున్నగు కార్యముల నొనర్చు దివ్యగుణములుగల యవినాశి ప్రభువు నీవే. 'పంచజనా అదితిః' జగజ్జీవన హేతువులగు పంచప్రాణములు నీవే. అవి నీనామములే. 'జాత మదితిః" అట్టి చేతన బ్రహ్మవు నీవు సదాప్రాదుర్భూతుడవు. అన్యములు ఉత్పత్తి వినాశములు కలవి. 'అదితిర్ జనిత్వము' అవినాశి స్వరూపేశ్వర! నీవే యీ జగజ్జన్మకు హేతువు.

( ప్రార్థన )

"ఓ౩మ్ ఋజునీతీ నో వరుణో మిత్రో నయతు విద్వాన్

అర్యమా దేవైః సజోషాః." 18

(ఋ. 1-14-90-1)

శ. అ. :- విద్వాన్ = సర్వజ్ఞుడు, వరుణః = సర్వ శ్రేష్ఠుడు, మిత్రః = సర్వమిత్రుడు, అర్యమా = న్యాయకారి దేవైః = దివ్యగుణములతో, సజోషాః=ప్రేమించువాడును నగు పరమేశ్వరుడు, నః = మమ్ములను, ఋజునీతీ=సరలనీతితో, నయతు = నడపునుగాక !

ద. వ్యా. ;- ఓమహారాజాధిరాజ పరమేశ్వర ! 'ఋజు నీతీ' సరలనీతియుక్తచక్రవర్తి రాజులనీతిని 'నయతు' మాకు కృపతో ప్రసాదింపుము. 'వరుణః' సర్వోత్తముడవు. మాకు వరనీతిని, వరరాజ్యమును, వరవిద్యను ఒసగుము. 'మిత్రః' నీవెల్లరకు మిత్రుడవు, శత్రుత్వములేనివాడవు. మమ్ము మిత్రగుణయుక్తులంజేసి న్యాయాధీశులం గావింపుము. నీవు సర్వోత్కృష్టవిద్వాంసుడవు. మాకు సత్యవిద్య నొసంగి, సునీతి నిచ్చి వెంటనే మమ్ము సామ్రాజ్యాధికారులం జేయుము. 'అర్యమా' నీవు యమరాజవు, ప్రియాప్రియములను విడిచి న్యాయమునందు వర్తించువాడవు. ప్రపంచమునందలి సర్వ జీవుల పాపపుణ్యములకు తగినవ్యవస్థ జేయువాడవు. మమ్ము లను అట్లే జేయుము, "దేవైః సజోషాః" విద్వాంసులయెడలను దివ్యగుణములయందును ఉత్తమప్రీతి గలిగియుండు నీయందు రమించుచు నిన్ను సేవించునట్లు దయతో మమ్మను గ్రహింపుము. ఓకృపానిధీ ! భగవంతా ! మాకు సహాయకుడ వగుము. మేము మఱచి నీతితో గూడినవారమై మాస్వరాజ్యము వర్ధిల్లున ట్లనుగ్రహింపుము.

(ప్రార్థన)

"ఓ౩మ్ త్వం సోమాసి సత్పతి స్త్వం రాజోత వృత్రహా
త్వం భద్రో అసి క్రతుః." 19

(ఋ. 1-14-91-5)

శ. అ. :- హేసోమ ! = ఓశాంతస్వరూప పరమాత్మా ! త్వమ్ = నీవు, సత్‌పతిః = సత్యమైనపాలకుడవు, అసి = అగుచున్నావు, త్వమ్ = నీవు, రాజా=ప్రకాశకుడవు, ఉత= మఱియు, వృత్రహా = అజ్ఞాననాశకుడవు, మేఘనిర్మాతవు' త్వమ్ = నీవు, భద్రః = మంచి, క్రతుః అసి=నిర్మాతవు.

ద. వ్యా, :- 'సోమ !' ఓరాజా ! సత్పతీ ! పరమేశ్వర ! నీవు సర్వసవనకర్తవు. ప్రాణస్వరూపుడవు, శాంతాత్ముడవు, మనుష్యులపరిపాలించువాడవు, నీవే యెల్లరకు రాజవు, 'ఉత వృత్రహా' మఱియు మేఘనిర్మాతవు, ధారకుడవు, నాశకుడవును, ఓభద్రస్వరూప ! నీవు మేలు చేయువాడవు. 'క్రతుః' సర్వజగత్కర్తవు.

(ప్రార్థన)

"ఓమ్ త్వం నః సోమ విశ్వతో రక్షా రాజన్నఘాయతః

న రిష్యేత్ త్వావతః సఖా." 20

(ఋ. 1-14-91-8)

శ. అ. :- హేసోమ ! = ఓశాంతిదాయక ! రాజన్ = సర్వేశ్వర ! పరమేశ్వర !, విశ్వతః = అన్నివైపులనుండి, అఘాయతః = పాపాభిలాషులనుండి, రక్ష = తప్పించి రక్షింపుము, త్వావతః = నీభక్తులు, సఖా=మిత్రులు, నరిష్యేత్= హానిపొందకుందురుగాక !

ద, వ్యా :- ఓసోమ ! రాజన్నీశ్వర ! నీవు "అఘాయతః" మాలో పాపులు, పాపముచేయగోరువారు ఉన్నచో 'విశ్వతః" వారినుండి 'రక్ష' మమ్ములను రక్షింపుము. ఎవరికి నీవు మిత్రుడవో 'నిరిష్యేత్' వారెన్నడు నష్టపడరు. నీసాహాయ్యము వలన మాకెన్నడు తిలమాత్రమైన దుఃఖముకలుగదు, నీకు మిత్రులైనవారు, నీమిత్రతను సంపాదించినవారు ఎందుకు దుఃఖముల పాలగుదురు ?

( ప్రార్థన )

"ఓ౩మ్ తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః

దివీవ చక్షు రాతతమ్." 21

(ఋ. 1-5-22-20)

శ. అ. :- సూరయః = జ్ఞానులు, విష్ణోః = వ్యాపక పరమేశ్వరుని, తత్ = అప్రసిద్ధమైన, పరమం = ఉత్తమ, పదం = పదమును, సదా = ఎల్లప్పుడు, దివి = ద్యులోకమునందు, ఆతతం = వ్యాపించిన, చక్షుః ఇవ = చక్షువువలె, పశ్యన్తి = చూతురు.

ద. వ్యా :- ఓవిద్వాంసులైన మనుష్యజీవులార ! విష్ణువుయొక్క పొందదగిన ఉత్కృష్టపదమును 'సూరయః' జితేంద్రియులగు విద్వాంసులు బాగుగ ఆలోచించి తెలిసికొందురు. ఆపదమును బొందినవారు మరల దుఃఖమును బొందరు. ఆపదము పరమేశ్వరునిది. ఆకాశమున నేత్రము వ్యాప్తిచెందునట్లు లేక సూర్యప్రకాశము వ్యాప్తమగునట్లు 'దివీవ చక్షురాతతమ్' పరమాత్మ సర్వత్ర ఏకరసమై వ్యాపించియున్నది. ఆపరమపద స్వరూపపరమాత్మయే పరమపదము. దానిని పొందుటచేతనే జీవనము సర్వదుఃఖములనుండి విడివడును. మఱియొకవిధముగ జీవునకు సుఖము లభింపదు. అందువలన పరమేశ్వర ప్రాప్తికొఱకు బాగుగ యత్నింపవలయును.

( ప్రార్థన )

"ఓ౩మ్ స్థిరా వః సన్త్వాయుధా పరాణుదే
వీళూ ఉత ప్రతిష్కభే
యుష్మాక మస్తు తవిషీ పనీయసీ మా మర్త్యస్య
మాయినః." 22 (ఋ, 1-8-39-2)

శ.అ.:-వః=మీయొక్క, ఆయుధా=ఆయుధములు, పరాణుదే=శత్రువులబాఅద్రోలుటకు, ఉత = మఱియు, ప్రతిష్కభే = అడ్డగించుటకు, స్థిరా = స్థిరములు, వీళూ = దృఢములు-వేగవంతములు, సంతు = అగుగాక !, యుష్మాకం = మీ, తవిషీ = శక్తి, పనీయసీ = ప్రశస్తము, అస్తు = అగుగాక ! మాయినః = వంచకుడైన, మర్త్యస్య = మనుష్యునిశక్తి, మా అస్తు = ప్రశస్తము కాకుండుగాక !

ద. వ్యా. :- పరమేశ్వరుడే సర్వజీవులను ఆశీర్వదించుచున్నాడు :- ఓజీవులార ! 'వః' మీయొక్క అస్త్రశస్త్రములు శతఘ్నులు మున్నగునవి యన్నియు స్థిరములు, 'వీళూ' దృఢములు నగుగాక ! ఎందులకు ? అన - 'పరాణుదే' శత్రువుల నోడించుటకు, దుష్టశత్రువులు మీకు దుఃఖము కలిగింపకుండుటకును "ఉత ప్రతిష్కభే" శత్రువులవేగము నడ్డగించుటకు నవి యుపయోగించును. 'యుష్మాక మస్తు తవిషీ పనీయసీ' మీసేన ప్రపంచమున ప్రశంసిత మగుగాక ! అందు

వలన శత్రువులు మీవంక చూచుటకును సంకల్పింపరు. 'మా మర్త్యస్య మాయినః" అన్యాయకారులు వంచకులునైన మనుష్యులను నేనిట్లు ఆశీర్వదింపను. దుష్టులు, పాపులు, ఈశ్వరభక్తిరహితులునైన మనుష్యులబలము రాజ్యము ఐశ్వర్యము మున్నగునవి వర్ధిల్లకుండుగాక! వారికి సదా పరాజయము కలుగుగాక! ఓబంధువులార! రండు; మనమందఅముకలిసి, దుఃఖములను నశింపజేయుటకును, విజయమును ప్రాప్తింపజేయుటకును ఈశ్వరుని ప్రార్థింతము. అతనిని ప్రసన్నుని జేయుదము. శత్రువులు వర్ధిల్లకుండున ట్లతడు మనల నాశీర్వదించునుగాక!

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ విష్ణోః కర్మా॑ణి పశ్యత॒ యతో॑ వ్ర॒తాని॑ పస్ప॒శే
ఇన్ద్ర॑స్య॒ యుజ్యః॒ సఖా॑." 23

(ఋ. 1-5-22-19)

శ.అ. :-విష్ణోః=సర్వవ్యాపకుడైన పరమేశ్వరుని, కర్మాణి= కర్మలను, పశ్యత = మీరెల్లరు చూడుడు, యతః = ఎవని నుండి, వ్రతాని = నియమములు, పస్పశే = ప్రకటమగునో ఆపరమేశ్వరుడు, ఇన్ద్రస్య = జీవునకు, యుజ్యః = యోగ్యుడైన, సఖా = మిత్రుడు.

ద.వ్యా. ;- ఓజీవులార ! 'విష్ణోః' వ్యాపకుడైన ఈశ్వరుడు రచించిన దివ్యజగత్తుయొక్క ఉత్పత్తిస్థితిలయరూపకర్మలను మీరు చూడుడు.

ప్రశ్న :- సృష్టిస్థితిలయములు వ్యాపకవిష్ణువుకర్మలని యేహేతువువలన మేమెఱుగనగును ?

ఉత్తర :- "యతో వ్రతాని పస్పశే" ఎవనివలన మనము బ్రహ్మచర్యాదివ్రతములు, సత్యభాషణాదివ్రతములు, మఱియు నీశ్వరుని నియమముల ననుష్ఠించుటకు సుశరీరధారులమై సమర్థులమైతిమో ఇది యంతయు నతనిసామర్థ్యముచేతనే జరుగుచున్నది. కారణమేమన "ఇంద్రస్య యుజ్యః సఖా" జీవుడు ఇంద్రియములతో వర్తించుచు, కర్మలకు కర్తయు భోక్తయు నగుచున్నాడు. ఈజీవున కాపరమేశ్వరుడే యోగ్య మిత్రుడు. మఱియొకడు లేడు. కారణమేమన : ఈశ్వరుడు జీవున కంతర్యామియై యున్నాడు. అతనిని మించి జీవునకు హితమొనర్చువాడు మఱియొకడు కాజాలడు. కావున జీవుడు పరమేశ్వరునితో మైత్రి చేసికొనవలయును.

(ప్రార్థన)

"ఓ3మ్ పరా ణుదస్వ మఘవన్న మిత్రాన్
త్సువేదా నో వసూ కృధి
అస్మాకం బోధ్యవితా మహాధనే భవా
వృధః సఖీనామ్." 24 (ఋ. 5-3-21-25)

శ. అ. :- హేమఘవన్! ఓపరమాత్మా! మా, అమిత్రాన్ = శత్రువులను, పరా + ణుదస్వ = పరాజితులంజేయుము, నః = మాకొఱకు, వసూ = ధనమును, సువేదాః కృధి = సులభముచేయుము, ఓప్రభూ! మహాధనే = యుద్ధమునందు, నీవే, అస్మాకమ్ = మా, సఖీనామ్ = మిత్రులయు, సేనయు, అవితా = రక్షకుడవు, వృధః = వర్ధకుడవు, భవ = అగుము, బోధి = మమ్ము నీవారలనుగా తెలిసికొనుము.

ద. వ్యా. :- 'మఘవన్' పరమైశ్వర్యశాలివగు నోపరమాత్మా! మాశత్రువులను 'పరాణుదస్వ' పరాజితులంజేయుము. ఓదాతా! 'సువేదాః నో వసూ కృధి' 'అస్మాకం బోధ్యవితా' మాకొఱకు పృథివిలోని ధనమంతయు సులభప్రాప్యము చేయుదువుగాక! 'మహాధనే' యుద్ధమునందు మామిత్రులను; సేనాదులను 'అవితా' రక్షించువాడవు, 'వృధః' వర్ధకుడవు 'భవ' అగుము. "బోధి" మమ్ము నీవారలనుగా తెలిసికొనుము. ఓభగవంతా! నీవు మాయోధుల రక్షకుడవైననాడే మాకు సర్వత్ర విజయము లభించును. ఇందు సందేహము లేదు.

( ప్రార్థన )

"ఓ౩మ్ శం నో భగః శము నః శంసో అస్తు

శం నః పురన్ధిః శము సన్తు రాయః

శం నః సత్యస్య సుయమస్య శంసః

శం నో అర్యమా పురుజాతో అస్తు." 25

(ఋ. 5-3-28-2)

శ. అ. :- ఓయీశ్వర !, భగః = ఐశ్వర్యము, నః = మాకు, శమ్ = సుఖకారకము. నః = మా, శంసః=ప్రశంస, ఉ = నిశ్చయముగా, శమ్ = సుఖకారకము, అస్తు = అగుగాక ! హేపురన్ధిః ! = ఓజగద్ధారక ! రాయః=ధనము, నః = మాకు, శమ్=సుఖదాయకము, సన్తు=అగుగాక !, సత్యస్య = సత్యయుక్తమునగు, శంసః = స్తుతి, నః = మాకు, శమ్ = శాంతికరమగుగాక !, హేఅర్యమా ! = ఓ న్యాయకారిప్రభూ!, పురుజాతః = అనంతశక్తియుక్తుడవగునీవు, నః = మాకు, శమ్అస్తు = శాంతిదాయకుడవగుదువుగాక !

ప, వ్యా. :- ఓయీశ్వర ! 'భగః'-నీచే నొసంగబడు ఐశ్వర్యము 'శంనః' మాకు సుఖము కలిగించుగాక! 'శము నః శంసో అస్తు' మేముచేయుస్తుతియు నీదయవలన సుఖ

కారకమగుగాక! 'పురంధిః శము సంతురాయః' ప్రపంచమును ధరించు నీవు, వాయువు, ప్రాణములు, ధనములు నన్నియు నీకృపవలన మాకు శాంతిని ప్రసాదించునుగాక, 'శం నః సత్యస్య సుయమస్య శంసః' సత్యము, యథార్థధర్మము, సుసంయమము, జితేంద్రియత మున్నగు లక్షణములతోగూడిన ప్రశంస లోకమున ప్రసిద్ధమై యున్నది. అయ్యది మాకు శాంతియుక్తము పరమానందదాయకము నగుగాక! 'శం నో అర్యమా!' న్యాయకారివగునీవు 'పురుజాతః' అనంతశక్తి యుక్తుడవు, మాకు కల్యాణకారకుడ వగుము.

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ త్వమసి ప్రశస్యో విదథేషు సహన్త్య
అగ్నే రథీరధ్వరాణామ్." 26 (ఋ. 5-8-35-2)

శ. అ. :- హే అధ్వరాణామ్ రథీః ! = యుద్ధములందు ముందుండుస్వామీ !, అగ్నే ! = సర్వజ్ఞ ! విదథేషు=యుద్ధములందు, సహన్త్యః=శత్రుసమూహముల నాశమొనర్చు, త్వమ్= నీవు, ప్రశస్యః అసి = స్తోతవ్యుడ వగుచున్నావు.

ద. వ్యా. :- హే 'అగ్నే!' సర్వజ్ఞ! నీవే యంతట, 'ప్రశస్యః' స్తుతింపయోగ్యుడవు "విదథేషు" యజ్ఞములందు, యుద్ధములందును నీవే స్తుత్యుడవు. నిన్ను విడిచి యన్య జడములను స్తుతించువానికి యజ్ఞయుద్ధాదికర్మలలో నెన్నడు

విజయము సిద్ధింపదు, 'సహన్త్య' శత్రుసమూహముల నాశకుడవు నీవే, "రథీరధ్వరాణామ్" యజ్ఞములందును నీవే ముందుండి నడపుదువు. శత్రుయోధులను పరాజితులం జేయువాడవు నీవే. అందువలన మాకెన్నడు పరాజయము కలుగదు.

(ప్రార్థన)

"ఓ౩మ్ తన్న ఇంద్రో వరుణో మిత్రో
అగ్నిరాప ఓషధీర్ వనినో జుషన్త
శర్మన్ త్స్యామ మరుతా ముపస్థే
యూయం పాత స్వస్తిభిః సదా నః." 27

(ఋ. 5-3-27-25)

శ. అ. :- తత్ = ఆ, ఇంద్రః=సూర్యుడు, వరుణః= చంద్రుడు, మిత్రః = వాయువు, అగ్నిః = అగ్ని, ఆపః = జలము, వనినః ఓషధీః = అరణ్యపుటోషధులు, నః = మమ్ము, జుషన్త = సేవించుగాక !, స్వస్తిభిః = రక్షణలచే, యూయం = నీవు, నః పాత = మమ్ము రక్షింపుము, మరుతామ్ = ప్రాణాదిపవనముల, ఉపస్థే = ఒడిలో, సదా = ఎల్లపుడు, శర్మన్ స్యామ = సుఖపడుదుముగాక !

ద. వ్యా. :- హేభగవన్! సూర్యచంద్రులు, వాయు జలములు, అగ్ని, ఓషధులు, నీయాజ్ఞవలన సుఖరూపములై మమ్ము సేవించుగాక! ఓరక్షక! ప్రాణాదుల కత్యంతసమీప మున నుండుమేము నీకృపవలన 'శర్మన్ స్యామ' సుఖ యుక్తుల మగుదుముగాక! రక్షణలతో నీవు మమ్ము సదా రక్షింపుము. మాకెట్టిహానియు కలుగకుండునట్లు చేయుము.

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ ఋషిర్ హి పూర్వజా అస్యేక ఈశాన ఓజసా

ఇన్ద్ర చోష్కూయసే వసు." 28

(ఋ. 5-8-17-1)

శ. అ. :- హే ఇన్ద్ర = ఓపరమైశ్వర్యశాలీ!, హి = నిశ్చ యముగా, నీవు పూర్వజాః = అన్నింటికంటె పూర్వుడవు, ఋషిః=సర్వద్రష్టవు, ఏకః ఈశానః అసి=అద్వితీయస్వామివి నీవే, ఓజసా = పరాక్రమముతో, వసు = ధనమును, చోష్కూ యసే = ప్రేమతో అనుభవింపజేయుచున్నావు.

ద. వ్యా. :- ఓయీశ్వర! 'ఋషిః' సర్వజ్ఞుడవు, 'పూర్వజాః' పూర్వముననుండువాడవు. 'ఏకః ఈశానః' అద్వి తీయ ఈశానకర్తవు, అందఱకంటె గొప్పవాడవు, ప్రళయా నంతరముకూడ నుండువాడవు, 'ఓజసా' అనంతపరాక్రమ యుక్తుడవు, ఓయింద్ర! మహారాజాధిరాజ! "చోష్కూయసే వసు" సర్వధనదాతవు, నీసేవకులమీద కృపాప్రవాహము ప్రవహింపజేయుదువు. నీవు అనంతార్ద్రస్వభావుడవు.

( ప్రార్థన )

"ఓ౩మ్ నేహ భద్రం రక్షస్వినే నావయైనోపయా
ఉత, గవే చ
భద్రం ధేనవే వీరాయ చ శ్రవస్యతేఽనేహసో వ
ఊతయః సు ఊతయో వ ఊతయః." 29
(ఋ. 6-4-9-2)

శ. అ. :- హేభగవన్!, ఇహ = ఈలోకమున, రక్షస్వినే = రాక్షసునకు, భద్రం న = సుఖము కలుగకుండుగాక; అవయైన = అధార్మికునకును సుఖముకలుగరాదు; ఉత ఉపయాః = అట్లే అధార్మికసమీపవర్తికిని, న=కలుగరాదు, నీకృపవలన, గవే = ఇంద్రియములకు, ధేనవే = గోవులుమున్నగుపశువులకు, వీరాయ = వీరపురుషులకు. భద్రమ్ = సుఖము కలుగుగాక! శ్రవస్యతే=కీర్తిమంతులకు, అనేహసః = నిరుపద్రవసుఖము చేరుగాక! ప్రభూ వః ఊతయః = నీరక్షణలు, సు ఊతయః = మంచిరక్షణలు, వ ఊతయః = నీరక్షణలే మాకు శరణ్యము.

ద. వ్యా. ;- ఓభగవంతా! 'రక్షస్వినే భద్రం నేహ' పాపులకు, హింసకులకు, దుష్టులకు ఈలోకమున సుఖము

నొసంగకు. 'నావయే' ధర్మవిరోధులకు సుఖమెన్నడు కలుగ రాదు. అట్లే 'నోపయా ఉత' అధార్మికులకు సమీపమున నుండువారికి, వారిసహాయకులకు నెన్నడు సుఖము లభింప కుండుగాక! దుష్టునకు సుఖమెన్నడును కలుగరాదని స్వామీ! నిన్ను మేము ప్రార్థించుచున్నాము. దుష్టులకు సుఖము కలుగునెడల నెవనికిని ధర్మమునందు రుచి కలుగదు. కావున ఈలోకమున ధర్మాత్ములకే సదా సుఖమునిమ్ము. శమదమాది గుణయుక్తములగు మాయింద్రియములు, పాలనిచ్చుగోవు మున్నగుపశువులు, వీరపుత్రులు, శూరవీరులైన భృత్యులు, 'శ్రవస్యతే' విద్య, విజ్ఞానము, అన్నాద్యైశ్వర్యములతోగూడిన మాదేశపురాజులు, ధనాఢ్యులైనజనులు, ఎల్లరు నిష్పాపులై, ఉపద్రవరహితులై సుఖము ననుభవింతురుగాక! "వ ఊత యః సు ఊతయః" ఓసర్వరక్షకప్రభూ! నీరక్షణలన్నియు మంచిరక్షణలు, అట్టి నీరక్షణలతో ధర్మాత్ములను రక్షించుచు వారికి 'భద్రమ్' కల్యాణమును చేకూర్పుము.

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ వసుర్ వసుపతిర్హి కమస్యగ్నే విభావసుః

స్యామ తే సుమతావపి." 30 (ఋ. 6-3-40-4)

శ. అ. :- హేఅగ్నే ! = ఓయగ్నీ ! హి=నిశ్చయముగా, వసుః = అందఱను తనలో వసింపజేయు, వసుపతిః = పృథివ్యాదివాసయోగ్యలోకాధిపతివి, కమ్ = ఆనందస్వరూపుడవు, విభావసుః = స్వప్రకాశకుడవు, అసి = అగుచున్నావు, తే = నీయొక్క, సుమతౌఅపి = సుమతియందును, స్యామ = ఉండునట్లును అనుగ్రహింపుము.

ద. వ్యా. :- ఓపరమాత్మా! 'వసుః' నీవందఱను వసింపజేయుచు, నందఱియందును నీవు వసించియున్నావు. 'వసుపతిః' వాసయోగ్యములగు పృథివ్యాదులకు పతివి. 'కమసి' ఆనందస్వరూపుడవు, ఎల్లరకు సుఖమునిచ్చువాడవు, 'విభావసుః' స్వయంప్రకాశకుడవు, ఓభగవంతా ! నీసుమతియందు మేము అధికజ్ఞానము కలవారమై పరస్పరప్రీతితో వర్తింతుము గాక !

## (ప్రార్థన)

"ఓం వైశ్వానరస్య సుమతౌ స్యామ

రాజా హి కం భువనానా మభిశ్రీః

ఇతో జాతో విశ్వ మిదం విచష్టే

వైశ్వానరో యతతే సూర్యేణ." 31

(ఋ. 1-15-98-1)

శ. అ. :- ఏది, హి = నిశ్చయముగా, భువనానామ్ = లోకములకు, పదార్థములకు, అభిశ్రీః = ఆశ్రయస్థానమో, కమ్ = సుఖస్వరూపమో, రాజా = అన్నింటిని ప్రకాశింప జేయునో అట్టి, వైశ్వానరస్య = పరమేశ్వరుని, సుమతౌ = ఉత్కృష్టజ్ఞానమునందు, స్యామ = మేముందుముగాక!, ఇదమ్ = ఈ, విశ్వమ్ = ప్రపంచము, ఇతః = ఈపరమేశ్వరునివలననే, జాతః = పుట్టినది, అతడు, దీనిని, విచష్టే = చూచుచున్నాడు, వైశ్వానరః = ఈపరమేశ్వరుడే, సూర్యేణ= సూర్యునిమూలమున, యతతే=అన్నింటిని నడపుచున్నాడు.

ద. వ్యా :- ఓమనుష్యులారా! ఎవడు మనకు సర్వ జగత్తునకు రాజో, సర్వలోకములకు స్వామియో, 'కమ్' సుఖ స్వరూపుడో, మఱియు 'అభిశ్రీః' సర్వశోభాకారకుడో, అతడే, 'వైశ్వానరో యతతేసూర్యేణ' ప్రపంచముననుండు సర్వనరులకు

నాయకుడు, సూర్యునితోకూడ అతడే ప్రకాశకుడైయున్నాడు. అనగా ప్రకాశించుపదార్థములనన్నింటి నతడే రచించి యున్నాడు. 'ఇతో జాత మిదం విచష్టే' ఈయీశ్వరునిసామర్థ్యముచేతనే ఈప్రపంచ ముత్పన్నమైనది. 'వైశ్వానరస్య సుమతౌ స్యామ' ఆపరమేశ్వరునిశోభితము ఉత్కృష్టమునైన జ్ఞానమునందు మేము నిశ్చయముగా సుఖస్వరూపవంతులము, విజ్ఞానవంతులము నై యుందుముగాక! ఓమహారాజాధిరాజా! ఈశ్వర! నీవు మాయీకోరికను పూర్ణము చేయుదువుగాక!

## ( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ న యస్య దేవా దేవతా మర్తా

ఆపశ్చ న శవసో అన్తమాపుః

స ప్రరిక్వా త్వక్షసా క్ష్మో దివశ్చ

మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ." 32

(ఋ. 1-15-100-15)

శ. అ.:- యస్య = ఎవని, అవసః = బలముయొక్క, అన్తమ్ = అంతమును, దేవాః = ఇంద్రియములు, మర్తాః = మనుష్యులు, ఆపః = ప్రాణములు, జలము, వాయువు, సముద్రములు, న అపుః=పొందజాలవో, సః=ఆపరమేశ్వరుడు,

ప్రరిక్వా = అన్నింట వ్యాపించియుండియు విలక్షణుడై, త్వక్షసా = శత్రుభేదకమగుతనబలముతో. క్ష్మః = పృథివిని, దివశ్చ = ద్యులోకమును, ధరించుచున్నాడు. మరుత్వాన్ = వేగవంతుడు బలవంతుడునగు, ఇంద్రః = పరమేశ్వరుడు నః = మాయొక్క, ఊతీ=రక్షణకొఱకు, భవతు=అగుగాక !

ద. వ్యా. :- ఓ యనంతబలా ! 'న యస్య' ఏపరమేశ్వరుని బలముయొక్క యంతమును, 'దేవాః' ఇంద్రియములు, దేవతాః=విద్వాంసులు, సూర్యుడు, బుద్ధిమున్నగుపదార్థములు, "న మర్తాః' సాధారణమనుష్యులు, 'అపశ్చ' ప్రాణములు, వాయువు, సముద్రములు, మున్నగునవి. 'అంతమ్' అన్తమును పొందజాలవు, కాని ఆపరమేశ్వరుడు 'పరిక్వా' బాగుగా వీనియందు వ్యాపకుడైయుండియు వీనికి భిన్నముగా నంతటఁ పరిపూర్ణుడైయున్నాడు. 'మరుత్వాన్ అనంతబలవంతుడగు నాపరమేశ్వరుడు, 'త్వక్షసా' శత్రునాశకమగు తనబలముతో, 'క్ష్మః' భూమిని, 'దివశ్చ' స్వర్గమును ధరించుచున్నాడు. అట్టి 'ఇన్ద్రః' పరమాత్మ 'ఊతీ' మా రక్షణకొఱకు 'భవతు' అగుగాక !

( ప్రార్థన )

"ఓ౩మ్ జాతవేదసే సునవామ సోమ మరాతీయతో

ని దహాతి వేదః స నః పర్ష దతి దుర్గాణి విశ్వా

నావేవ సింధుం దురితాత్యగ్నిః." 33

(ఋ. 1-15-100-1)

శ. అ. :- మేము, జాతవేదసే = పుట్టినప్రపంచము నంతటిని నెఱుగు పరమేశ్వరునికొఱకు, సోమం = సాంసారిక దివ్యపదార్థములను, సునవామ=అర్పించుచున్నాము, అతడు, అరాతీయతః = శత్రువుల, వేదః = ధనమును, నిదహాతి = నిశ్చయముగ దహించును. సః అగ్నిః = జ్ఞానస్వరూపపరమేశ్వరుడు, నావా ఇవ = పల్లెకారి నౌకతో, సింధుమ్ = సముద్రమును దాటవేయునట్లు, నః = మమ్ములను, అతి దుర్గాణి = మిక్కిలిదుర్గమములు, అతిదురితా = మిక్కిలి దుఃఖకరములునైన, విశ్వాని=సమస్తపాపాచరణములనుండి, పర్షత్ = దాటవేయును.

ద. వ్యా. ;- హే 'జాతవేదః' ఓపరబ్రహ్మమా! నీవు జాతవేదుడవు. పుట్టినపదార్థముల నన్నింటి నెఱుగుదువు. అంతటనుందువు. విద్వాంసు లెఱుగునన్నింటి యందును నుందువు, ప్రాదుర్భూత-అనంతధనవంతుడవు: అనంతజ్ఞాన

వంతుడవు; అందువలననే నీవు జాతవేదుడ వనిపించుకొను చున్నావు. అట్టినీకొఱకు, "వయం సోమం సునవామ" మాకు ప్రియములు గుణవిశిష్టములునగు మా పదార్థములన్నియు అర్పించుచున్నాము. ఓదయాలూ! "అరాతీయతః" ధర్మాత్ములమైనమమ్ము ద్వేషించు దుష్టశత్రువులయొక్క 'వేదః' ధనమును, "నిదహాతి" నిత్యము దహింపజేయుము. అందువలన వారు తమదౌష్ట్యమును విడిచి శ్రేష్ఠతను స్వీకరింతురుగాక! 'నః' మమ్ములను 'దుర్గాణివిశ్వా' దుస్సహములగు సంపూర్ణదురితములనుండి "పర్షదతి" తరింపజేసి నిత్యసుఖమును పొందజేయుము, "నావేవ సింధుమ్" మిక్కిలిలోతైన నదిని, సముద్రమును దాటుటకు నౌక యుపయోగించునట్లు, "దురితా త్యగ్నిః" నీవుమమ్ము పాపజనితదుఃఖములనుండి వేఱుచేసి పరమసుఖము ననుభవింపజేయుము.

(ప్రార్థన)

ఓ౩మ్ స వ॒జ్రభృద్ద॒స్యుహా భీ॒మ ఉ॒గ్రః
స॒హస్రచేతాః శ॒తనీ॒థ ఋభ్వా
చ॒మ్రీ॒షో న శవ॒సా పాఞ్చజన్యో
మ॒రుత్వాన్నో భ॒వత్విన్ద్ర ఊ॒తీ." 34

(ఋ. 1-15-100-12)

శ. అ. :- చమ్రీషః న = శత్రుసేనను చంపువానివలె, వజ్రభృత్=వజ్రమును ధరించువాడు, దస్యుహా = దుష్టసంహారకుడు, భీరుః=భయంకరుడు, ఉగ్రః = ఉగ్రుడు, సహస్రచేతాః = సహస్రగుణవంతుడు, శతనీథః = అనేకములగు ప్రశస్తవ్యవహారములుకలవాడు, పాంచజన్యః = పంచప్రాణముల నుత్పన్నముచేయువాడు, మరుత్వాన్ = మిక్కిలివేగవంతుడు, ఇన్ద్రః=సేనాపతియునైన, సః=ఆపరమేశ్వరుడు, ఋభ్వా శవసా=మిక్కిలిబలవంతములగు సేనలద్వారా, నః= మా, ఊతీ = రక్షణకొఱకు, భవతు = ప్రవృత్తుడగుగాక !

ద. వ్యా. :- ఓదుష్టనాశకపరమేశ్వర ! నీవు "వజ్రభృత్" అభేద్యసామర్థ్యముతో సర్వశిష్టరక్షకము, దుష్టవినాశకమగు న్యాయమును, ధరించువాడవు. "ప్రాణో వై వజ్రః" శతపథము. అందువలననే, 'దస్యుహా' దుష్టపాపులను వధించువాడవు. 'భీమః' నీ న్యాయమగునాజ్ఞ నుల్లంఘించువారికి మిక్కిలిభయమును కలిగించువాడవు. 'సహస్రచేతాః' అనేకములగు విజ్ఞానాదిగుణములు కలవాడవు. 'శతనీథః' అనేకములగు పదార్థముల నొసంగువాడవు. 'ఋభ్వా' మిక్కిలి విజ్ఞానాదిప్రకాశములు కలవాడవై సర్వమును ప్రకాశింపజేయు మహాబలవంతుడవు. "స చమ్రీషః" ఎవనిసేనకు వశుడవు కావు. 'శవసా' నీబలముతో 'పాంచజన్యః' పంచప్రాణములు నుత్పన్నముచేయువాడవు. 'మరుత్వాన్' సమస్తవాయువులను ప్రవహింపజేయువాడవు. 'ఇన్ద్రః' నీవు ఇంద్రుడవు; మారక్షణకొఱకు ప్రవృత్తుడవగుము. మాకేమియు హాని కలుగకుండునట్లనుగ్రహింపుము.

## ( ప్రార్థన )

ఓ3మ్ సేమం నః కామ మాపృణ గోభి రశ్వైః శతక్రతో
స్తవామ త్వా స్వాధ్యః." 35 (ఋ. 1-4-16-9)

శ. అ. :- హే శతక్రతో !=పరమేశ్వర !, సుస్వాధ్యః= ఉత్తమధ్యానమొనర్చుమేము, త్వా = నిన్ను, స్తవామ = నిత్యము స్తుతిచేయుదుముగాక ! సః = అట్టినీవు, గోభిః = గోవులతో, అశ్వైః = గుఱ్ఱములతో, నః = మా, ఇమాం=ఈ, కామం = కోరికను, అపృణ = పూర్ణముచేయుము.

ద. వ్యా :- 'శతక్రతో !' ఓయనన్తక్రియేశ్వర ! నీవసంఖ్యాతవిజ్ఞానాదియజ్ఞములవలన పొందదగినవాడవు, అనంతక్రియాబలయుక్తుడవు .అట్టినీవు, "గోభిరశ్వైః" ఉత్తమములగు ఇంద్రియములు శ్రేష్ఠపశువులు, అశ్వవిద్య, అశ్వములు మున్నగువానిచే 'సేమం కామమ్ అపృణ' మాకామమును పూర్ణముచేయుము. మేముకూడ 'స్తవామ త్వా స్వాధ్యః' సుబుద్ధితోకూడి యుత్తమవిధమున నిన్ను స్తుతింతుముగాక ! నిన్నుమించి మఱియొకడు మాకోరికలను నెఱవేర్పజాలడు. నిన్ను విడిచి యితరుల ధ్యానించువాడు కోరికలను పొందలేడు.

( స్తుతి మంత్రము )

ఓ౩మ్ సోమ గీర్భిష్ట్వా వయం వర్ధయామో వచోవిదః

సుమృళీకో న ఆవిశ." 36 (ఋ. 1-14-91-11)

శ. అ. :- సోమ ! = ఈశ్వర !, గీర్భిః=స్తోత్రములతో, వచో విదః = శాస్త్రవిదులమగు, వయమ్ = మేము, త్వా = నిన్నుగూర్చి, వర్ధయామః = యశోగానము చేయుచున్నాము, సుమృళీకః = సుఖదాయకప్రభో !, నః=మమ్ము. ఆవిశ = ప్రాప్తించువుగాక !

ద, వ్యా :- 'సోమ !' సర్వజగదుత్పాదకేశ్వర ! నిన్ను 'వచో విదః' శాస్త్రవిదులమగు మేము; స్తుతిసముదాయములతో, 'వర్ధయామః' సర్వోపరివిరాజిల్లుచున్నావని యెంచుచున్నాము. "సుమృళీకః నః అవిశ" మాకు మంచిసుఖము నిచ్చువాడవు నీవే. కృపతో మమ్మాదేశింపుము. మేము అవిద్యాంధకారమును విడిచి విద్యాసూర్యుని పొంది ఆనందింతుముగాక !

( ప్రార్థన )

ఓ౩మ్ సోమ రారన్ధి నో హృది గావో న యవసేష్వా
మర్య ఇవ స్వ ఓక్యే." 37

(ఋ. 1-14-91-13)

శ. అ. :- సోమ !=ఈశ్వర ! నీవు, నః=మా, హృది = హృదయమున, యవసేషు = తృణాదిభక్ష్యపదార్థములందు, గావః న = గోవులు రమించునట్లు, మర్యః = మనుష్యుడు, స్వ ఓక్యే ఇవ=తనయింటియందువలె, ఆరారన్ధి=రమింపుము.

ద.వ్యా. ;- 'సోమ' సౌఖ్యప్రదేశ్వర ! నీవు కృపతో 'రారన్ధి నో హృది' మాహృదయములందు రమింపుము. సూర్యకిరణములు, విద్వాంసులమనస్సులు, గోవుమున్నగు పశువులు తమతమ తృణాది విషయములందు చేరి రమించునట్లు, లేక 'మర్య ఇవ స్వ ఓక్యే' మనుష్యుడు తనయింటియందును రమించునట్లును భగవన్ ! నీవు నీప్రకాశముతో గూడిన మాహృదయములందు రమింపుము. అందువలన మాకు యథార్థజ్ఞానము కలిగి ఆనందింతుము.

( స్తుతి మంత్రము )

ఓ3మ్ గయస్ఫానో అమీవహా వసువిత్పుష్టివర్ధనః

సుమిత్రః సోమ నో భవ." 38

(ఋ. 1-14-91-12)

శ. అ. :- సోమ ! = ప్రభూ ! నీవు, నః = మా, గయస్ఫానః = ప్రజను, ధనమును, జగత్తునువృద్ధినొందించువాడవు, అమీవహా = రోగనాశకుడవు, వసువిత్ = పృథివిమున్నగువసువుల నెఱుంగువాడవు, సుమిత్రః=పరమమిత్రుడవు, పుష్టివర్ధనః = పుష్టినిపెంచువాడవు, భవ = అగుము.

ద. వ్యా, :- ఓపరమాత్మభక్తులగునో జీవులార !, మీకిష్టుడైన పరమేశ్వరుడు, 'గయస్ఫానః' ప్రజ, ధనము, జనపదము, స్వరాజ్యము అనువీనిని వృద్ధిపొందించువాడు. 'అమీవహా' శరీరము, మనస్సు, ఇంద్రియములు ననువీనిరోగములను నశింపజేయువాడు, 'వసువిత్" పృథివిమున్నగు వసువుల నెఱుగువాడు, సర్వజ్ఞుడు, విద్యాదిధనప్రదుడు, "పుష్టివర్ధనః" మనశరీరాదులను వృద్ధిపఱచువాడు. "సుమిత్రః సోమ నో భవ" అతడేమనకుపరమమిత్రుడు. 'సోమ' కృపతో మాకు మంచిమిత్రుడవగుము. మేము మీమైత్రినే కోరుదుము అని ప్రార్థింతము రండు.

## ( ప్రార్థన )

"ఓ౩మ్ త్వం హి విశ్వతోముఖ విశ్వతః పరిభూరసి

అప నః శోశుచదఘమ్." 39

(ఋ. 1-15-97-6)

శ. అ. :- ఈశ్వర !, త్వం = నీవు, హి = నిశ్చయముగా, విశ్వతో ముఖః = సర్వోపదేష్టవు, విశ్వతః=అంతట, పరిభూః = సర్వోపరివిరాజమానుడవు, అసి = అగుచున్నావు, ఓప్రభూ !, నః = మా, అఘమ్=పాపమును, అపశోశుచత్=దూరమొనర్పుము.

ద. వ్యా. :- ఓయగ్నీ ! పరమాత్మా ! 'త్వం హి' నీవే, 'విశ్వతః పరిభూరసి' సర్వజగత్తునందును, సర్వస్థానములందును వ్యాపకుడవై యున్నావు. అందువలననే నీవు విశ్వతోముఖుడవు. ఓసర్వతోముఖ అగ్నీ ! నీవు స్వశక్తితో సర్వజీవులహృదయములందు సత్యోపదేశమును నిత్యము చేయుచున్నావు. అదియే నీముఖము. ఓకృపాలూ ! 'అపనః శోశుచదఘమ్' నీ ఇచ్ఛవలన మాపాపములన్నియు నష్టములగుగాక ! మేము నిష్పాపులమై నీయందు భక్తికలిగి నీయాజ్ఞలను పరిపాలింప తత్పరుల మగుదుముగాక !

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ తమీళత ప్రథమం యజ్ఞసాధం
విశ ఆరీరాహుత మృఞ్జసానమ్
ఊర్జః పుత్రం భరతం సృప్రదానుం దేవా
అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్." 40

(ఋ. 1-15-96-3)

శ. అ. :- ప్రథమం = సృష్టికిముందుండు, యజ్ఞసాధమ్=యజ్ఞసాధకుడైన, తమ్=ఆపరమేశ్వరుని, ఈళత= స్తుతింపుడు, హేఆరీర్ = ఓప్రాప్తింపయోగ్యులగు, విశః = ప్రజలారా! అహుతం = విద్వాంసులచే సత్కృతుడు ఋఞ్జసానమ్ = వివేకాదిగుణసాధ్యుడు, ఊర్జః పుత్రం భరతమ్= అన్నమును పాలించుపోషించు, సృప్రదానుమ్ = ఎల్లరను గతిశీలురంజేయువాడునగు నాపరమేశ్వరుని, దేవాః=విద్వాంసులు, అగ్నిం ధారయన్ = అగ్నియనిచెప్పుచు ధరింతురు. అతడే యెల్లరకు, ద్రవిణోదామ్ = నిర్వాహమునకుయోగ్యములగు అన్నజలవిద్యాదిపదార్థముల నొసంగువాడు.

ద. వ్యా :- ఓమనుష్యులార ! 'తమీళత' ఆయగ్నిని స్తుతియింపుడు. ఆయగ్నియెట్టిది ? అన 'ప్రథమమ్' అన్నికార్య పదార్థములకు ముందుండునది. అన్నింటికి ఆదికారణము. అట్లే 'యజ్ఞసాధమ్' సర్వప్రపంచము, విజ్ఞానాదిరూపయజ్ఞ మును సాధించునది. అన్నింటికిజనకము, ఓ 'విశః' మనుష్యు లార ! ఆయగ్నినే స్వామియని యంగీకరించి 'ఆరీః' ప్రాప్తిం చుడు. అతనినే తనవానినిగా పిలుతురు. విద్వాంసులు విజ్ఞా నాదులతో సాధింతురు-ఎఱుగుదురు. 'ఊర్జః పుత్రం" పృథి వ్యాదిజగద్రూపమగునన్నమును పాలించి, పోషించి ధరించు వాడు. 'సుప్రదానుమ్' సర్వజగత్తునకు చలనశక్తి నిచ్చువాడు, జ్ఞానదాతయు నతడే. 'దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్' అతనినే,విద్వాంసులు అగ్నియందురు; ధారణచేయుదురు. అతడే సర్వజగన్నిర్వాహణార్థమావశ్యకమగు అన్నజలాదిపదార్థ ములను జ్ఞానము నొసంగును. అతనిని విడిచి యన్యునియెడ భక్తికలిగియుండరాదు-యాచింపరాదు.

( ప్రార్థన )

ఓ3మ్ తమూతయో రణయఞ్ఛూరసాతౌ
తం క్షేమస్య క్షితయః కృణ్వత త్రామ్
స విశ్వస్య కరుణస్యేశ ఏకో
మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ." 41

(ఋ. 1-15-100-7)

శ. అ. :- హే క్షితయః ! = ఓ మనుష్యులార !, శూర సాతౌ = శూరులుపయోగపడు యుద్ధమునందు, తం = ఆ పరమాత్మనుగూర్చి, ఊతయః = రక్షణకొఱకు చేయబడిన ప్రార్థనలు, రణయన్ = వర్ణించుడు, తమ్=ఆ, క్షేమస్య = క్షేమకారియగు పరమేశ్వరునే, త్రామ్ = డాలుగా, కృణ్వత= చేసికొనుడు, సః = అతడే, విశ్వస్య = సమస్త, కరుణస్య= కరుణామయకార్యములను చేయుటలో, ఏకః = ఒక్కడే, ఈశః = సమర్థుడు, మరుత్వాన్ = మరుత్తులతోకూడి, సః ఇన్ద్రః = ఆపరమేశ్వరుడు, నః=మనరక్షణకొఱకు, భవతు= అగుగాక !

ద. వ్యా. :- ఓమానవులార ! 'తమూతయః' ఆపరమై శ్వర్యశాలియగు పరమేశ్వరుని ప్రార్థన, శరణాగతివలన మనకు 'ఊతయః' అనంతరక్షణ, బలాదిగుణములు ప్రాప్తించును. 'శూరసాతౌ' యుద్ధమునందు మనకు 'రణయన్' రతి, రణ భూమియందు శూరవీరులగుణములు, పరస్పరప్రీతియు ప్రాప్తింపజేయును. 'తం క్షేమస్య క్షితయః' ఓశూరవీరమానవు లార ! అతనినే క్షేమమునకు, కుశలతకు, 'త్రామ్' రక్షకుని, 'కృణ్వత' చేసికొనుడు. అందువలన మనకు పరాజయ మెన్నడు కలుగదు. కారణమేమన :- "సః విశ్వస్య" అతడు కరుణామయుడు, సర్వజగత్తును కరుణించువాడు. 'ఏకః' ఒక్కడే-మఱియొకడు లేడు. ఆపరమేశ్వరుడు, 'మరుత్వాన్' ప్రాణవాయువు, బలము సేనతోగూడినవాడై, 'ఊతీ' మనపై గలకృపతో బాగుగ రక్షించును. ఈశ్వరరక్షితులమైన మన మెన్నడును పరాజయమును బొందము.

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ స పూర్వయా నివిదా కవ్యతాయో రిమాః
ప్రజా అజనయన్ మనూనామ్,
దివస్వతా చక్షసా ద్యామపశ్చ దేవా
అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్." 42

(ఋ. 1-15-96-2)

శ. అ. :- సః = పరమేశ్వరుడు, పూర్వయా=సనాతనమైన, నివిదా = వేదవాణియనెడి, కవ్యతా = కవితతో, ఆయోః = అనాదికారణమునుండి, మనూనాం = మనుష్యులకు, ఇమాః = ఈ, ప్రజాః = ప్రజలను, చక్షసా = చూడనుపకరించు, వివస్వతా = సూర్యునితోబాటు, ద్యామ్ = ద్యులోకమును, అపః = అంతరిక్షమును, అజనయత్ = పుట్టించెను, దేవాః = విద్వాంసులు, ద్రవిణోదామ్=మనస్సునిచ్చు, అగ్నిం = పరమేశ్వరుని, ధారయన్ = ధరించుచున్నారు.

ద. వ్యా. ;- ఓమనుష్యులార ! 'పూర్వయా నివిదా' అతడే ఆదిసనాతనుడు, సత్యతాదిగుణయుక్తుడునగు అగ్ని-పరమాత్ముడే యున్నాడు. మఱియొకడులేడు. సృష్టికి ఆదియందు స్వప్రకాశస్వరూపుడైన యొక్కయీశ్వరుడే ప్రజలనుత్పన్నముచేయ నీక్షించెను. "కవ్యతాయో రిమాః" సర్వజ్ఞత్వాది సామర్థ్యముతోనే సత్యవిద్యాయుక్తవేదములను, 'మనూనామ్' మననశీలురగు మనుష్యులను, అన్యపశుపక్ష్యాదులను, 'ప్రజాః' ప్రజను, 'అజనయత్' ఉత్పన్నముచేసెను. మనుష్యులు, పశుపక్ష్యాదులలో పరస్పరవ్యవహారనిర్వహణార్థము. మననశీలురగు మనుష్యులతనినే స్తుతియింపదగును. 'వివస్వతా చక్షసా' సూర్యాదితేజోమయపదార్థములను ప్రకాశింపజేయు నాపరమేశ్వరుడే బలముతో స్వర్గమును-సుఖవిశేషమును, సర్వలోకములను, 'అపః' అంతరిక్షస్థపృథివ్యాది మధ్యస్థలోకములను, నికృష్టదుఃఖవిశేషరూపనరకమును

సర్వదృశ్యమాననక్షత్రాదిలోకములను నతడే సృజించెను. అట్టి సచ్చిదానందస్వరూపుడగు పరమాత్మదేవుని, 'ద్రవిణోదామ్' విజ్ఞానాదిధనముల నొసంగువానిని 'దేవాః' విద్వాంసులు అగ్నిగా నెఱుగుదురు. అతనినే మనము భజింతుముగాక !

( ప్రార్థన )

ఓ౩మ్ వయం జయేమ త్వయా యుజా

వృతమస్మాక మంశముదవా భరే భరే

అస్మభ్య మిన్ద్ర వరివః సుగం కృధి

ప్రశత్రూణాం మఘవన్ వృష్ణ్యా రుజః." 43

(ఋ. 1-15-102-4)

శ. అ. :- మఘవన్ ! = ఓమహాధనేశ్వర ! ఇన్ద్ర ! = పరమేశ్వర ! త్వయా యుజా=నీతోగూడినవారమై, వయమ్= మేము, జయేమ = జయింతుముగాక ! ప్రభూ ! వృతమ్ = పరిపాలింపదగిన, అస్మాకమ్ = మా, అంశం = బలమును, భరేభరే = యుద్ధములందు, నీవు, ఉత్అవ = బాగుగ రక్షింపుము, శత్రూణామ్ = శత్రువుల, వృష్ణ్యా=శౌర్యమును, ప్రరుజ = నష్టముచేయుము, అస్మాకమ్ = మాకు, వరివః = ధనమునుపొందుట, సుగమ్ కృధి=సులభముచేయుము.

ద. వ్యా. :- ఓయింద్ర! పరమేశ్వర! "త్వయా యుజా వయం జయేమ" నీతో వర్తించు, నీసాహాయ్యముతో మేము దుష్టశత్రువులను జయింతుముగాక! 'అవృతమ్' శత్రుసేన మాసేనతో ఆవరింపబడుగాక! ఓమహారాజాధిరాజేశ్వర 'భరే భరే అస్మాక మంశ ముదవ' ప్రతియుద్ధమునందును మాబలమును కాపాడుము. ఉత్తమరీతితో రక్షింపుము. ఏయుద్ధమునందును మేము క్షీణించి పరాజయము పొందకుందుముగాక! నీసాహాయ్యముగలవారికి అంతట విజయమే కలుగును. ఓ 'ఇంద్రమఘవన్' మహాధనేశ్వర! 'శత్రూణాం వృష్ణ్యా' మాశత్రువీరుల పరాక్రమమును 'ప్రరుజ' భగ్నముచేయుము. రోగయుక్తముచేసి నశింపజేయుము. "అస్మభ్యం వరివః సుగం కృధి" మాకు చక్రవర్తిరాజ్యము, సామ్రాజ్యధనమును సులభముగా ప్రాప్తింపజేయుము. నీకరుణాకటాక్షముతో మా రాజ్యము ధనము సదా వృద్ధిబొందునుగాక!

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ యో విశ్వస్య జగతః ప్రాణతస్పతిర్
యో బ్రహ్మణే ప్రథమో గా అవిన్దత్
ఇంద్రో యో దస్యూం రధరాం అవాతిరన్
మరుత్వన్తం సఖ్యాయ హవామహే." 44

(ఋ. 1-15-101-5)

శ. అ. :- యః=ఎవడు, విశ్వస్య=సంపూర్ణ, జగతః= ప్రాణరహిత, ప్రాణతః = ప్రాణముగల ప్రపంచమునకు, పతిః = స్వామియో, యః = ఎవడు, ప్రథమః=ప్రథముడో, బ్రహ్మణే = బ్రాహ్మణునకు-విద్వాంసునకు, గాః = పృథివిని, అవిందత్=అందజేసెనో, యః=ఎవడు, ఇంద్రః=పరమైశ్వర్య వంతుడో, దస్యూన్ = శత్రువులను, అధరాన్ అవాతిరన్ = క్రిందపడవేయునో, అట్టి, మరుత్వంతమ్ = బలవంతుడగు పరమేశ్వరుని, సఖ్యాయ = మైత్రికొఱకు, హవామహే = ఆహ్వానించుచున్నాము-ఆహ్వానింపవలయును.

ద. వ్యా. :- ఓమనుష్యులార! స్థావరము, జంగమము నగు జగత్తునకు 'పతిః' పతి-అధిష్ఠాతయు, అన్నిటికంటె ప్రథముడునగు పరమేశ్వరుడు 'బ్రహ్మణే గాః అవిన్దత్' విజ్ఞానియైన బ్రాహ్మణునకు పృథివియందు రాజ్యాదిలాభములు లభించునట్లు నియమించియున్నాడు. 'ఇన్ద్రః' పరమైశ్వర్య వంతుడగు పరమేశ్వరుడు 'అధరాన్' శత్రువులను క్రిందపడు నట్లుజేయును - నిర్జితులంజేయును. కావున 'మరుత్వంతం సఖ్యాయ హవామహే' మిత్రులార! రండు. మనమందఱము ప్రీతితో పరమానన్తబలపరాక్రమవంతుడైన దేవుని సఖ్యము కొఱకు ఆహ్వానింతము-ప్రార్థింతము. అతడు శీఘ్రముగా కృపతో మనయెడ మిత్రభావము వహించును. ఇందు సందేహ మావంతయులేదు.

( ప్రార్థన )

"ఓ౩మ్ మృళా నో రుద్రోత నో మయస్కృధి
క్షయద్ వీరాయ నమసా విధేమ తే
యచ్ఛ ఇంచ యోశ్చ మను రాయేజే పితా
తదస్యామ తవ రుద్ర ప్రణీతిషు." 45

(ఋ. 1-16-114-2)

శ. అ. :- రుద్ర! = రుద్రుడా! క్షయద్వీరాయ = శత్రువీరులను నశింపజేసిన, తే = నీకు, నమసా = సత్కారము, విధేమ = చేయుదుముగాక!, నః = మమ్ములను, మృడ = సుఖులంజేయుము, నః = మాకు, మయః=అనన్త సుఖమును, కృధి = ఇమ్ము, రుద్ర! = ఓన్యాయకారీ! మనుః = మననశీలుడగు, పితా = తండ్రివలె, యత్ శమ్= ఏశాంతి, యోః చ=దుఃఖవిముక్తియు కలవో, వానిని, ఆయేజే= నీవు సంపన్నము చేయుదువు, తమ్=దానిని, తవ=నీయొక్క, ప్రణీతిషు = ఉత్తమనీతులందు ప్రవృత్తులమైనమేము, ఉత అశ్యామ = పొందుదుముగాక!

ద. వ్యా. :- దుష్టులనేడ్పించునోరుద్ర! ఈశ్వర! 'మృడ" మమ్ము సుఖింపజేయుము. 'మయస్కృధి' అత్యంత

సుఖము మాకు ఇమ్ము. 'క్షయద్ వీరాయ నమసా విధేమ' శత్రువీరులను నశింపజేయు నీకు నమస్కారములతో సేవ జేయుమమ్ము రక్షింపుము. 'యచ్ఛమ్' ఓరుద్ర! నీవు మాపాలకుడవు. మాప్రజలను సుఖింపజేయుము. 'యోశ్చ' ప్రజలరోగములనుగూడ నశింపజేయుము. 'మనుః ఆయేజే' ప్రేమించుతండ్రి తనప్రజను అనేకవిధముల లాలించునట్లు నీవును మమ్ము రక్షింపుము. ఓరుద్రభగవన్! 'తవప్రణీతిషు' నీయాజ్ఞలను పాలించుచు, నీయుత్తమనీతులందు వర్తించుచు 'తదశ్యామ' వీరభోగ్యమగు చక్రవర్తిరాజ్యమును నీయనుగ్రహముచే ననుభవింతుముగాక!

( ప్రార్థన )

"ఓ3మ్ దేవో న యః పృథివీం విశ్వధాయా
ఉపక్షేతి హితమిత్రో న రాజా
పురఃసదః శర్మసదో న వీరా
అనవద్యా పతిజుష్టేవ నారీ." 46

(ఋ· 1-12-73-3)

శ. అ. :- యః = ఎవడు, పృథివీమ్ న = పృథివివలె, విశ్వధాయా = విశ్వమునుధరించు, దేవః=ఆపరమేశ్వ

దుని, హితమిత్రః = మిత్రులకుహితముచేయు, రాజా న = రాజువలె, ఉపక్షేతి = చూచునో-ఎఱుగునో, పురఃసదః = ఈశ్వరాభిముఖుఁడగు మనుష్యుఁడు, వీరాః న = వీరులవలె, అనవద్యా = ఉత్తమగుణయుక్తయగు, పతిజుష్టా=పతివ్రత, నారీ ఇవ=నారివలె, శర్మసదః=సుఖములందుండువాడగును.

ద.వ్యా :- ప్రియబంధువులగు నోవిద్వాంసులార! 'దేవో న'సూర్యునివలె ఈశ్వరుఁడు విశ్వమునకులోపల వెలుపల నంతట ప్రకాశించుచున్నాఁడు. 'యః పృథివీం' ఎవఁడు పృథివ్యాదులను రచించి ధరించునో, 'విశ్వధాయా ఉపక్షేతి' మఱియు విశ్వధారకశక్తికి నివాసమిచ్చి ధారణచేయుచున్నాఁడో 'హితమిత్రో న రాజా!' ప్రియమిత్రులుగలరాజు తనప్రజలను పాలించునట్లు సర్వజగత్తునకు పరమమిత్రుఁడైన పరమేశ్వరుఁడు మనలను పాలించువాఁడు అతఁడొక్కఁడే మఱియొకఁడు లేఁడు. 'పురః సదః శర్మసదో న వీరాః' ఈశ్వరాభిముఖులగు మనుష్యులు సుఖములందుందురు. 'న వీరాః' తండ్రియింటియందు పుత్రులు ఆనందముతో నుండునట్లు పరమాత్మభక్తులు సదా సుఖము ననుభవింతురు. అనన్యచిత్తులై నిరాకారుఁడు సర్వవ్యాపకుఁడునగు పరమేశ్వరుని సత్యశ్రద్ధాభక్తులతో సేవించువారు "అనవద్యా పతిజుష్టేవ నారీ" ఉత్తమగుణవతియగు పతివ్రతయైనస్త్రీ రాత్రింబవళ్లు మిక్కిలిప్రేమతో పతికనుకూలయై యుండునట్లు, సోదరులార! రండు. ప్రీతియుక్తులమై యీశ్వరుని భక్తితో సేవింతము. అందఱము పరమాత్ముని వలన పరమసుఖము ననుభవింతము.

( ప్రార్థన )

"ఓ౩మ్ సామా సత్యోక్తిః పరిపాతు విశ్వతో

ద్యావా చ యత్ర తతనన్నహాని చ

విశ్వమన్యన్ని విశతే యదేజతి విశ్వాహాపో

విశ్వాహోదేతి సూర్యః" 47

(ఋ. 7-8-12-2)

శ. అ. :- ప్రభూ ! నీ, సా సత్యా ఉక్తిః=ఆసత్యవాణి, మా = నన్ను, పరిపాతు = రక్షించుగాక ! యత్ర = ఎవని యాశ్రయమున, ద్యావా అహాని చ=రాత్రిందినములు, విశ్వతః= అన్నివైపుల, తతనన్ = విస్తృతములగునో, విశ్వమ్ = ఈ ప్రపంచము, అన్యత్ = ఇతరమున, నివిశతే=నివిష్టమగునో, యత్ = ఎవని యుత్థానముననది, ఏజతి = గతిమంతమగునో, విశ్వాహా = అన్నిదినములలోను, ఆపః=జలముప్రవహించునో, సూర్యః = సూర్యుడు, విశ్వాహా = సర్వదినములందును, ఉదేతి = ఉదయించునో !

ద. వ్యా. :- ఓ సర్వాభిరక్షకేశ్వర ! "సామా సత్యోక్తిః" మేమనుష్ఠించు నీసత్యమగుఆజ్ఞ, 'విశ్వతః పరిపాతు"మమ్ముల

నెల్లయెడల పాలించుగాక! సర్వదుష్టకార్యములనుండి దూరముగ నుంచుగాక! మాకెన్నడు నధర్మమొనర్చుకోరిక కలుగకుండుగాక! 'ద్యావాచ' దివ్యసుఖముతో యుక్తులంజేసి తగినట్లు మమ్ము రక్షించుగాక! 'యత్ర' ఏదివ్యసృష్టియందు 'అహాని' దినములేర్పడుటకు, 'సూర్యాదులను 'తతనన్' నీవే విస్తరింపజేసితివో, అక్కడను సర్వోపద్రవములనుండియు మమ్ము కాపాడుము. "విశ్వమన్యత్" నీకంటె భిన్నమగు నీజగత్తు నీసామర్థ్యమువలన నెప్పుడు ప్రళయమునందు 'నివిశతే' ప్రవేశించునో - కారణరూపమున పరిణమించునో అప్పుడును నీవు మమ్ము రక్షింపుము. 'యదేజతి' అవియెన్నడు మరల సృష్టిసమయమున నీసామర్థ్యముచేతనే చలించునో అప్పుడును మమ్ము సమస్తబాధలనుండి కాపాడుము. 'విశ్వాహాపో విశ్వాహా' విశ్వహంతకుని నశింపజేయుము. నీసామర్థ్యము వలననే ఉత్పత్తి స్థితిలయములు జరుగును. అట్టి నీయెదుట నేరాక్షసుడేమిచేయగలడు? నీవే సర్వత్రప్రకాశమానుడవై యుందువు. సూర్యునివలె మాహృదయములందు ప్రకాశింపుము. మాయవిద్యాంధకారమును నశింపజేయుము.

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ దేవో దేవానామసి మిత్రో అద్భుతో
వసుర్ వసూనామసి చారు రధ్వరే
శర్మన్ త్స్యామ తవ సప్రథస్తమేఽగ్నే
సఖ్యే మా రిషామా వయం తవ." 48

(ఋ. 1-15-94-13)

శ. అ. :- అగ్నే ! = ఓసర్వజ్ఞపరమేశ్వర !, దేవానాం= విద్వాంసులలో జ్ఞానులలో, దేవః = నీవు పరమవిద్వాంసుడవు, జ్ఞానివి, అద్భుతః మిత్రః = అద్భుతమిత్రుడవు, అసి=అగుచున్నావు, వసూనామ్ = వసువులలో, నీవు, వసుః = వసించువాడవు, అధ్వరే=జ్ఞానయజ్ఞమునందు నీవు, చారుః అసి=అత్యంత శోభాయమానుడవు, తవ = నీ, సప్రథస్తమే = అతివిస్తృతమగు, శర్మన్ = సుఖమునందు, వయమ్=మేము, స్యామ= స్థిరముగానుందుముగాక ! తవ = నీయొక్క, సఖ్యే = మిత్రభావమున, మారిషామ = ఎన్నడు ఉన్మనస్కులము కాకుందుముగాక !

ద, వ్యా :- ఓమానవులార ! ఆపరమేశ్వరుడెట్టివాడు ? అతనినెందుకు మనము స్తుతియింపవలయును ? ఓయగ్నీ !

పరమేశ్వర ! నీవు 'దేవో దేవానామసి' విద్వాంసులకు విద్వాంసుడవు. వారికి పరమానందము నిచ్చువాడవు : 'అద్భుతః' అత్యంతాశ్చర్యకరమగు మిత్రుడవు. సర్వసుఖకారకుడవగు సర్వసఖుడవు. 'వసుర్ వసూనామసి' పృథివ్యాది వసువుల నన్నిటిని వసింపజేయువాడవు. 'అధ్వరే చారుః' జ్ఞానాది యజ్ఞములం దత్యంతశోభాయమానుడవు - శోభనుగలిగించువాడవు. ఓపరమాత్మా ! 'సప్రథస్తమే సఖ్యే శర్మన్ తవ' నీయత్యంత విస్తృతానంద స్వరూపమైత్రియందు మేము స్థిరముగా నుందుముగాక ! అందువలన మాకెన్నడు దుఃఖము కలుగకుండుగాక ! నీయనుగ్రహమువలన మేము పరస్పరము ప్రేమపూర్వకముగ వర్తింతుముగాక! మాలో వైరభావ మెన్నడు నేర్పడకుండుగాక !

( ప్రార్థన )

ఓ౩మ్ మా నో వధీ రింద్ర మా పరా దా

మా నః ప్రియా భోజనాని ప్రమోషీః

అణ్డా మా నో మఘవఞ్ఛక్ర నిర్భేన్

మా నః పాత్రా భేత్ సహజానుషాణి." 49

(ఋ. 1-15-104-8)

శ. అ. :- మఘవన్ ! = ఓధనేశ్వర ! శక్ర = సకల వ్యవహారదక్ష ! ఇన్ద్ర = శత్రువినాశకప్రభూ !, నః = మమ్ము లను, మావధీః = నాశనముచేయకు, మాపరాదా = మమ్ము దూరముచేయకు, నః = మాయొక్క, సహజానుషాణి = స్వభావానుకూలములగు, ప్రియాః భోజనాని = ప్రియకరము లగు భోజనములను, మాప్రమోషీః = హరింపజేయకు, నః = మా, అణ్డాః = గర్భములను, మానిర్భేత్ = విదారణము చేయకు, నః=మా, పాత్రాః=పాత్రలను, మా భేత్=భిన్నము చేయకు.

ద. వ్యా, :- 'ఇన్ద్ర!' ఓపరమైశ్వర్య యుక్తేశ్వర! "మా నో వధీః" మమ్మ వధింపకు-మమ్మ నీనుండి యెన్నడు వేఱుచేయకు, "మాపరాదాః" నీవు మాకు దూరముకావలదు. "మా నః ప్రియా భోజనాని ప్రమోషీః" మాప్రియభోగములను హరింపకు. "అణ్డా మా నో నిర్భేత్" మాగర్భములను విదారణ చేయకు. 'హేమఘవన్' ఓసర్వశక్తిమంతా ! 'శక్ర !' ఓసమ ర్థుడా ! మాపుత్రులను విదారణచేయకు. 'మా నః పాత్రా' మాభోజనాదుల కుపయోగించు సువర్ణపాత్రాదులను మానుండి దూరముచేయకు. 'సహజానుషాణి' మాసహజన్ములు, అను షక్తులు, స్వభావముచే అనుకూలురునగు మిత్రులను నష్ట పఱపకు, దయతో పూర్వోక్తసర్వపదార్థములను యథాయోగ్య ముగ రక్షింపుము.

( ప్రార్థన )

ఓ3మ్ మా నో మహాన్త ముత మా నో అర్భకం
మా న ఉక్షన్త ముత మా న ఉక్షితమ్
మా నో వధీః పితరం మోత మాతరం
మా నః ప్రియా స్తన్వో రుద్ర రీరిషః." 50

(ఋ. 1-16-114-7)

రుద్ర ! = ఓదుష్టవినాశకేశ్వర ! నీవు, నః =మా, మహాన్తమ్ = వృద్ధులను, మావధీః=చంపవలదు, ఉత=మఱియు, నః = మా, అర్భకమ్ = బాలకులను, మా = చంపవద్దు; నః = మా, ఉక్షన్తం = యువకులను, మా = చంపవలదు, ఉత = మఱియు, నః = మా, ఉక్షితమ్ = గర్భములను, మా = నష్టపఱపకు, నః = మా, పితరం = తండ్రిని, ఉత మాతరం= తల్లిని, మా = చంపవద్దు, నః = మా, ప్రియాః తన్వః=ప్రియశరీరములను, మారీరిషః=హింసింపవద్దు.

ద. వ్యా. ;- ఓరుద్ర ! నీవు మాపై కృపకలవాడవై మా జ్ఞానవృద్ధులను, వయోవృద్ధులను, బాలకులను, యువకులను, గర్భములను, మాతాపితరులను, ప్రియశరీరములను వేనిని హింసింపక కాపాడుదువుగాక !

( స్తుతి మంత్రము )

ఓ౩మ్ మా నస్తోకే తనయే మా న ఆయౌ

మా నో గోషు మా నో అశ్వేషు రీరిషః

వీరాన్ మా నో రుద్ర భామితో వధీర్

హవిష్మన్తః సదమిత్ త్వా హవామహే." 51

(ఋ. 1-16-114-8)

శ. అ. :- రుద్ర ! దుష్టనాశక ! నః=మా, తోకేతనయే= బాలబాలికలను, నః ఆయౌ = మా ఆయువును, నః = మా, గోషు = ఆవులను, నః అశ్వేషు= మాగుఱ్ఱములను, నః హవిష్మన్తః వీరాన్ = మాయజ్ఞము నొనర్చువీరులను, భామితః = క్రోధితుడవై, రీరిషః = రోషయుక్తుడవై, మావధీః=చంపకు, త్వా = నిన్ను, సదమ్ ఇత్ = ఎల్లప్పుడును, హవామహే = ఆహ్వానింతుము.

ద. వ్యా. :- కనిష్ఠులు, మధ్యములు, జ్యేష్ఠులునగు బాలబాలికలను. గోవుమున్నగు పశువులను, ఉత్తమవాహనోపయుక్తతురగాదులను, యజ్ఞదక్షులైన శూరవీరులను, క్రోధరోషయుక్తుడవై ప్రభూ! హింసింపకుము. మేము నిన్నెప్పుడు నాహ్వానింతుము. ఓభగవన్ ! రుద్ర ! పరమాత్మా ! నిన్నిదే ప్రార్థించుచున్నాము. మాపుత్రపౌత్రులను, ధనాదులను రక్షింపుము.

(ప్రార్థన)

"ఓ౩మ్ ఉద్గాతేవ శకునే సామ గాయసి
బ్రహ్మపుత్ర ఇవ సవనేషు శంససి
వృషేవ వాజీ శిశుమతీ రపీత్యా
సర్వతో నః శకునే భద్ర మా వద
విశ్వతో నః శకునే పుణ్య మా వద." 52

(ఋ. 2-4-43-2)

శ. అ. :- హేశకునే !=సర్వశక్తిమన్నీశ్వర ! ఉద్గాతా ఇవ = సామవేదమున నిష్ణాతుడవువలె, సామగాయసి=సామ గానము చేయుదువు, బ్రహ్మపుత్రః ఇవ=వేదవేత్తవలె, సవనేషు = యజ్ఞములందు, శంససి = పదార్థవిద్యను ప్రశంసింతువు, వాజీ=వేగవంతుడవగుటవలన, వృషా ఇవ=ఉత్తమ గుణములనుపదార్థములనువర్షింపుము. నీకృపవలన, శిశుమతీః= ఉత్తమసంతానమును. అపి ఇత్య=పొంది మేము సంతుష్టుల మగుదుముగాక ! శకునే ! = ఓజగదీశ్వర ! సర్వతః = అన్ని వైపులనుండి నః = మాకొఱకు, భద్రమ్ = కల్యాణమును, ఆవద = చెప్పుము, శకునే ! = ఓపరమేశ్వర ! విశ్వతః =

సర్వజగత్తునుండి, నః = మాకొఱకు, పుణ్యామ్ ఆవద = పుణ్యము నుపదేశింపుము.

ప. వ్యా. :- 'శకునే!' ఓసర్వశక్తిమన్! ఈశ్వర! నీవు సదా సామగానము చేయుదువు. అట్లే మాహృదయములందు సర్వవిద్యలు ప్రకాశించునట్లు గానముచేయుము. యజ్ఞము నందు మహాపండితుడు సామగానము సేయునట్లు నీవుకూడ మాలో సామాదివిద్యలను ప్రకటింపజేయుము. 'బ్రహ్మపుత్ర ఇవ సవనేషు' నీవు కృపతో సవన - పదార్థవిద్యనుప్రశం సింతువు, 'శంససి' అట్లే మమ్ములనుగూడ యథాయోగ్యముగ ప్రశంసితులంజేయుము. వేదవిదులు విజ్ఞానముతో సర్వపదార్థ ములను ప్రశంసించునట్లు నీవుకూడ మమ్ములను కృపతో జూడుము. "వృషేవవాజీ!" నీవు సర్వశక్తిని సించింపజేయు టకు సమర్థుడవు. అన్నాదిపదార్థముల నిచ్చువాడవు. మహా బలవంతుడవు, వేగవంతుడవు-కావున వాజివి. వృషభము వలె ఉత్తమగుణములను ఉత్తమపదార్థములను వర్షింపజేయు వాడవు. మాపై వానిని వర్షింపజేయుము. "శిశుమతీః" మేము నీకృపవలన ఉత్తమశిశువులను 'అపీత్య' పొంది నిన్నే భజిం తుముగాక! 'ఆసర్వతో నః శకునే' సామర్థ్యయుక్తుడవగునో స్వామీ! సర్వస్థానములనుండియు మాకొఱకు 'భద్రం' కల్యాణ మును 'ఆవద' కలిగించు ఆజ్ఞలను విధింపుము. అకల్యాణము నెన్నడును వినకుందుముగాక!, 'విశ్వతో నః శకునే' ఎల్లరకు సుఖమునొసంగు నోదేవా! సర్వజగత్తునకు 'పుణ్యామ్ ఆవద' శుభకరమగు ధర్మకార్యము నొనరింప నాజ్ఞాపింపుము. అందు వలన నెవడును అధర్మము నాచరింప నభిలషింపడు. ఎల్ల యెడల సత్యధర్మప్రవృత్తి యేర్పడును.

(ప్రార్థన)

"ఓం ఆవదం స్త్వం శకునే భద్ర మావద
తూష్ణీ మాసీనః సుమతిం చికిద్ధి నః
యదుత్పతన్ వదసి కర్కరిర్ యథా
బృహద్ వదేమ విదథే సువీరాః." 53

(ఋ. 2-4-43-3)

శ. అ. :- శకునే = ఓసర్వశక్తిమంతా! త్వమ్=నీవు, అవదన్ = ఉపదేశముచేయుచు, భద్రమ్=మోక్షసుఖమును, వద=ఉపదేశింపుము ఓప్రభూ! తూష్ణీమాసీనః=మాహృదయమున మౌనముగానుండుము, సుమతిమ్ = సుమతిని ప్రదానముచేయుము, నః = మమ్ములను, చికిద్ధి=నీనివాసస్థానము చేసికొనుము, ఉత్పతన్ = ఉత్తమవ్యవహారమున చేర్చు నీయొక్క, యత్ = ఏది, యథా = ఏవిధముగా, కర్కరిః = కర్తవ్యకర్మను, వదసి = ఉపదేశించుచున్నావు, విదథే = యజ్ఞమునందు, సువీరాః=అత్యంతకర్మవీరులమై, బృహత్= గొప్పవాడవగు నీయొక్క, వదేమ = స్తుతిచేయుదుము.

ద. వ్యా. :- 'ఆవదం స్త్వం శకునే!' ఓశకునీ జగదీశ్వరా! నీవు 'భద్రమ్' కల్యాణమునకు కల్యాణము-వ్యావహారికసుఖమునుమించిన మోక్షసుఖమును నిరంతరము నెల్ల

రకు నుపదేశింపుము. 'తూష్ణీమాసన్' ఓయంతర్యామీ, మా హృదయములందు స్థిరముగానుండుము. మౌనముతోనే 'సుమతిమ్' సర్వోత్తమజ్ఞానము నొసంగుము. 'చికిద్ధి నః' కృపతో మమ్ము నీయునికికి తగినగృహముగా జేసికొనుము. నీపరమవిద్యను మేము పొందుదుముగాక! "యదుత్పతన్" ఉత్తమవ్యవహారమున జేర్చుచు మాకు కర్తవ్యకర్మను, ధర్మమునుమాత్రమే మిక్కిలిపురుషార్థముతో జేయుము; అకర్తవ్య దుష్టకర్మను జేయకు' అను నీయుపదేశము-యథాయోగ్యమగు నుద్యమము నెన్నడు విడువరాదు-చేయుదువు. 'బృహద్వదేమ విదథే' విజ్ఞానాదియజ్ఞమునందు లేకధర్మయుక్తయుద్ధమున మిక్కిలి శూరవీరులమై, పరబ్రహ్మవగు నీస్తుతి, నీయుపదేశము ప్రార్థన, ఉపాసన సదా చేయుదుముగాక! నీయనుగ్రహమున పరమానందము ననుభవింతుముగాక!

ఓమ్ మహారాజాధిరాజాయ పరమాత్మనే నమః
మహారాజాధిరాజగు పరమాత్మకు నమస్కారము
శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు
మహావిద్వాంసులు నైనశ్రీయుత విరజా
నందసరస్వతీస్వాములకు శిష్యుడైన
దయానందసరస్వతీస్వామిచే
రచియింపబడిన ఆర్యాభివినయమున
ప్రథమప్రకాశము
పూర్తియయ్యెను.

ఓ౩మ్

# ద్వితీయ ప్రకాశము

## ( ప్రార్థన )

"ఓ౩మ్ సహ నావవతు సహ నౌ భునక్తు

సహ వీర్యం కరవావహై

తేజస్వినావధీత మస్తు మా విద్విషావహై

ఓ౩మ్ శాన్తిః శాంతిః శాన్తిః." 1

(తై. అ. 1-1)

శ. అ. :- ఓ ప్రభూ ! నీకృపవలన, నౌ = మేమిరువురము, సహ = కలిసి, అవతు = ఒండొరులను రక్షించుకొందుముగాక !, నౌ = మేమిరువురము, సహ=కలిసి-తోడ్తో, భునక్తు = ఐశ్వర్యము ననుభవింతుముగాక !, సహ = కలిసి, వీర్యం = శక్తిని, కరవావహై = వృద్ధి నొందించుకొందుముగాక ! నౌ=మాయిరువురి, అధీతం=అధ్యయనము, తేజస్వి=

తేజోవంతము, అస్తు = అగుగాక, మా విద్విషావహై=పరస్ప రము ద్వేషింపకుందుముగాక !

ద, వ్యా :- ఓసహన శీలేశ్వర! మేము ప్రసన్నతతో పరస్పరరక్షకుల మగుదుముగాక! నీకృపవలన మేము సదా నీస్తుతిప్రార్థనోపాసనము చేయుదుముగాక! నిన్నే తల్లి, తండ్రి, బంధువు, రాజు, స్వామి, సహాయకుడు, సుఖదుడు, సుహృత్తు, పరమగురువుగా నెంచెదముగాక! క్షణకాలముకూడ నిన్ను మఱవకుందుముగాక ! నీకు సమానుడుకాని, అధికుడుకాని మఱియొకడున్నాడని యెన్నడు నెంచము. నీయనుగ్రహము వలన మేము పరస్పరము ప్రీతిమంతులము, రక్షకులము, సహాయకులము, పరమపురుషార్థులము నగుదుముగాక! ఒకరిదుఃఖము, నింకొకరము చూడకుందుముగాక! స్వదేశ మున నుండుమానవులను మిక్కిలి నిర్వైరులనుగా ప్రీతి మంతులనుగా చేయుదుముగాక! 'సహనౌభునక్తు' మేము పరస్పరము పరమానందము ననుభవింతుముగాక !

మేము ఒండొరులకు హితముచేసికొనుచు ఆనందము ననుభవింతుముగాక ! నీవు మమ్ము నీపరమానందము ననుభ వించువారలనుగా జేయుము. ఆయానందమునుండి క్షణ కాలముకూడ మమ్ము వేఱుచేయకు. 'సహ వీర్యం కరవావహై' నీసాహాయ్యమువలన సత్యవిద్యాదిరూపపరమవీర్యములను పరస్పరము పురుషార్థమువలన పొందుదుముగాక ! 'తేజస్వినా వధీతమస్తు' ఓయనంత విద్యామయ' భగవన్తా ! నీకృపా దృష్టివలన, మాపఠనపాఠనము పరమవిద్యాయుక్తమగుగాక! ప్రపంచమున నెల్లరికంటె, నెక్కుడుప్రకాశితుల మగుదుమ

గాక! అన్యోన్యప్రేమతో పరమవీర్యము పరాక్రమమువలన నిష్కంటకచక్రవర్తిరాజ్యము ననుభవింతుముగాక! మాలో నందఱు సజ్జనులు నీతిమంతులు నగుదురుగాక! నీవు మాపై మిక్కిలి దయచేయుదువుగాక! మేము పాషండతను, అసత్యమును, వేదవిరుద్ధమతములను విడిచి సత్యసనాతనమతస్థుల మగుదుముగాక! విద్వేషమునకు మూలములగు పాషండ మతములన్నియు నశించునుగాక!

"మా విద్విషావహై" ఓజగదీశ్వర! నీసామర్థ్యమువలన మేము పరస్పరము విద్వేషము, విరోధము విడిచిపెట్టుదుము గాక! తనుమనోధనములను, విద్యాదులను పరస్పరసుఖోపకారకకార్యములలో వినియోగింతుముగాక!

"ఓ3మ్ శాంతిః శాంతిః శాంతిః" ఓజగదీశ్వర! ముప్విధములగు తాపములు జగమునగలవు. ఒకటి ఆధ్యాత్మికము. శారీరికము-జ్వరాదితాపము, రెండవది ఆధిభౌతికము. శత్రువులు, సర్పాదులు, వ్యాఘ్రాదులు, చోరులుమున్నగువారిచే కలుగుతాపము, మూడవది ఆధిదైవికము. మనస్సు, ఇంద్రియములు, అగ్ని, వాయువు, అతివృష్టి, అనావృష్టి, అతిశీతము, అత్యుష్ణము, మున్నగు వానిచే కలుగుతాపము. కృపాసాగర! నీవు ఈత్రివిధతాపములను శీఘ్రముగా తొలగింతువుగాక! అందువలన నిన్ను ఉపాసించి పరమానందము ననుభవింతుముగాక!

ఓవిశ్వగురూ! నన్నసత్యపదార్థములనుండి తొలగించి సత్యములు నిత్యములునైన వ్యవహారములందు స్థిరపఱతువు

గాక ! ఓజగన్మంగలా ! సర్వదుఃఖములనుండి విడిపించి సర్వసుఖముల ననుభవింపజేయుము. ఓప్రజాపతీ ! నాకు, మంచిసంతానము, హస్త్యశ్వాద్యుత్తమపశువులు, సర్వోత్కృష్ట విద్య, చక్రవర్తిరాజ్యము మున్నగుపరమైశ్వర్యములు పరమ సుఖదాయకములై లభించునట్లుచేయుము. ఓపరమవైద్య ! సర్వరోగములను దూరముచేసి ఆరోగ్యమును ప్రసాదింపుము. ఓమహారాజాధిరాజ ! మనోవాక్కాయములతో అజ్ఞానముతో, ప్రమాదముతోను చేసినపాపములను క్షమించి జ్ఞానపూర్వక ముగా పాపముచేయుటనుండియు తప్పించి కాపాడుము.

ఓన్యాయాధీశ ! కుకామ, కులోభ, కుమోహ, భయ శోకాలస్యేర్ష్యాద్వేషప్రమాద విషయతృష్ణానైష్ఠుర్యాభిమానదుష్ట భావావిద్యాదులనుండి నివారించి వీనికి విరుద్ధములైన సుకామాదులను మాయందు స్థాపింపుము. నేను మిక్కిలి దీనుడనై నిన్నర్థించుచున్నాను. నిన్ను, నీయాజ్ఞలను విడిచి అన్యపదార్థముల నెన్నడును ప్రేమించకుందునుగాక !

ఓప్రాణపతీ ! ప్రాణప్రియ ! ప్రాణపితా ! ప్రాణాధార ! ప్రాణజీవన ! స్వరాజ్యప్రద ! నీవే నాకు సహాయకుడవు. నాకు నిన్నుమించి మఱియెవడును లేడు. ఓరాజాధిరాజ ! నీరాజ్య మెట్లు సత్యమో, న్యాయయుక్తమో, అఖండితమో అట్లే నీకృపవలన మాకును నట్టిరాజ్యము లభించునుగాక ! నీరాజ్య మున కింకరులమగునట్లు శీఘ్రముగా మమ్మనుగ్రహింపుము. ఓన్యాయప్రియ ! మమ్ము న్యాయప్రియులం జేయుము. ఓధర్మాధీశ ! మమ్ము ధర్మమునందు స్థిరులం జేయుము. కరుణామయపితా ! తల్లిదండ్రులు తమ సంతానమును పాలించునట్లు నీవును మమ్ము పాలింపుము.

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరం
శుద్ధ మపాపవిద్ధమ్-కవిర్ మనీషీ పరిభూః
స్వయంభూర్ యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధా
చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః" 2 (య. 40-8)

శ. అ. :- బ్రహ్మము, శుక్రం=శీఘ్రకారి, అకాయం= శరీరరహితము, అవ్రణమ్ = వ్రణరహితము, అస్నావిరం = నాడీబంధనరహితము, శుద్ధం = పవిత్రము, అపాపవిద్ధం = పాపసంసర్గములేనిది, కవిః = సర్వజ్ఞము, మనీషీ = అన్తర్యామి, పరిభూః = సర్వోపరివిరాజమానము, స్వయంభూః= స్వయంసత్తాగలిగినది - ఉత్పత్తిరహితమును అయి, పరి ఆగాత్=అంతటను వ్యాపించియున్నది, సః=అపరబ్రహ్మమే, శాశ్వతీభ్యః = నిత్యములైన, సమాభ్యః = జీవరూపప్రజల కొఱకు, యాథాతథ్యతః = యథాయోగ్యముగ, అర్థాన్ = పదార్థములను, వ్యదధాత్ = రచించుచున్నాడు.

ద. వ్యా. ;- "స పర్యగాత్" ఆపరమాత్మ ఆకాశమువలె అంతట పరిపూర్ణుడై యున్నాడు. "శుక్రమ్" సర్వజగత్తును రచించువాడతడే. 'అకాయమ్" ఆతడెన్నడు శరీరము (అవతారము) ను ధరింపడు. అతడఖండుడు, అనంతుడు, నిర్వి

కారుడు నగుటచే దేహధారణ మెన్నడు చేయడు. అతనికంటె నధికమగుపదార్థము లేదు. అందువలన నీశ్వరుడెన్నడు శరీర ధారణ చేయడు. 'అవ్రణమ్' అతడఖండైకరసుడు; అచ్ఛేద్యుడు; అభేద్యుడు, కంపనరహితుడు; అచలుడు. అందువలన నతనిలో అంశాంశిభావముకూడలేదు. అతనిలో నేవిధముగను ఛిద్రము కలుగదు. 'అస్నావిరమ్' అతనికి నాడ్యాదుల బంధనముకూడ కలుగజాలదు. అతిసూక్ష్ముడగుటచే నీశ్వరున కెట్టియావరణము కలుగదు. 'శుద్ధమ్' అతడెల్లపుడు నిర్మలుడు. అవిద్యాదులు, జన్మమరణములు, హర్షశోకములు, క్షుత్పిపాసలు మున్నగుదోషోపాధు లతనికి ఉండవు.

శుద్ధుని ఉపాసించువాడు శుద్ధుడేయగును. మలినునుపాసించువాడు మలినుడగును. 'అపాపవిద్ధమ్' పరమేశ్వరుడెన్నడు నన్యాయము సేయడు. అతడు సదైవ న్యాయకారియే. 'కవిః' త్రికాలజ్ఞుడు, సర్వవిదుడు, మహావిద్వాంసుడు. అతని విద్యయొక్క యంతము నెవ్వడు కనుగొనజాలడు, 'మనీషీ' సర్వజీవుల మనస్సునకు-విజ్ఞానమున కతడు సాక్షి. అందఱి మనస్సు నతడు దమనము సేయగలడు. 'పరిభూః' అన్ని దిక్కులందు నంతటను నతడు నిండియున్నాడు. సర్వమునకు పైన విరాజిల్లుచున్నాడు. 'స్వయంభూః' అతనికాదికారణము, మాత, పిత ఉత్పాదకుడెవ్వడును లేడు. కాని, యతడే యన్నింటికి నాదికారణము. 'యాథాతథ్యతో .... సమాభ్యః' అయీశ్వరుడే తనప్రజకు యథాయోగ్యముగ సత్యము, సత్యవిద్య—నాలుగువేదములు మనుష్యుల కుపదేశించియున్నాడు.

అదయామయుడగు పరమేశ్వరుడే మిక్కిలిదయతో అవిద్యాంధకారమును నశింపజేయు వేదవిద్యారూపసూర్యుని ప్రకాశింపజేసియున్నాడు. అన్నింటికి నాదికారణ మాపరమాత్మయే. యనియు, సర్వవిద్యాప్రకాశకమగు వేదమునకు నాదికారణ మతడేయనియు నిశ్చితముగా నంగీకరింపవలయును. ఈశ్వరుడు కృపతో తానే విద్యనుపదేశించియున్నాడు. సర్వపదార్థములను మనకొఱకు సృష్టించినవాడు విద్యాదాన మేలచేయడు ? సర్వోత్కృష్టమగు విద్యారూపపదార్థము నతడే దానము చేసియున్నాడు. వేదముకాక మఱియొకగ్రంథము ప్రపంచముననేదియు ఈశ్వరోక్తము కాదు. ఈశ్వరుడెట్లు పూర్ణవిద్యావంతుడు న్యాయకారియు నైయున్నాడో వేదముకూడ నట్టిదియే. వేదమునకు తుల్యమైనదికాని, అధికమైనదికాని మఱియొక పుస్తకము లేదు. ఈవిషయము నధికముగా నెఱుగగోరువారు నాచే రచింపబడిన సత్యార్థప్రకాశ మనుగ్రంథమును చూడుడు.

( ప్రార్థన )

"ఓ౩మ్ దృతే దృగ్ంహ మా మిత్రస్య మా చక్షుషా
సర్వాణి భూతాని సమీక్షన్తామ్
మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే
మిత్రస్య చక్షుషా సమీక్షామహే." 3

(య. 36-18)

శ. అ. :- దృతే !=దుష్టస్వభావనాశక ! మా దృంహ= నన్ను వర్ధిల్లజేయుము. సర్వాణి భూతాని=సర్వప్రాణులును, మా = నన్ను, మిత్రస్య చక్షుషా=మిత్రదృష్టితో, సమీక్షన్తామ్= చూచునుగాక !, అహమ్ = నేను, మిత్రస్య చక్షుషా = మిత్ర దృష్టితో, సర్వాణి భూతాని = సర్వప్రాణులను, సమీక్షే = చూతునుగాక !, మిత్రస్య చక్షుషా = మిత్రదృష్టితో, సమీక్షా మహే = మేము పరస్పరము చూచుకొందుముగాక !

ద. వ్యా. :- ఓయనంతబల ! మహావీర ! ఈశ్వర ! 'దృతే' ఓదుష్టస్వభావనాశక ! విదీర్ణకర్మ-విజ్ఞానాది శుభ గుణములను నశింపజేయునన్ను రక్షింపకు. అట్టి దుస్స్వభా వమునుండి తప్పించి విద్య, సత్యధర్మము మున్నగుశుభగుణ ములు గలవానినిగా వర్ధిల్లజేయుము. 'దృంహ మా' ఓపరమై శ్వర్యశాలీ ! భగవన్ ! ధర్మార్థకామమోక్షాదులను, విద్యా

విజ్ఞానాదులను నాకొసంగి నన్ను వర్ధిల్లజేయుము. 'మిత్రస్య చక్షుషా సర్వాణి భూతాని సమీక్షన్తామ్' ఓసర్వసుహృదీశ్వర! సర్వాన్తర్యామీ! సర్వప్రాణులు మిత్రదృష్టితో యథాయోగ్యముగ నన్ను చూచునుగాక! అందఱు మాకు మిత్రులగుదురుగాక! ఎవరును నన్ను వైరభావముతో చూడకుందురుగాక! 'మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే' ఓపరమాత్మా! నీకృపవలన నేనుకూడ నిర్వైరుడనై సర్వప్రాణులను, అప్రాణిజగత్తును అంతటిని స్వాత్మవలె, స్వప్రాణమువలె చూతునుగాక! 'మిత్రస్య చక్షుషా సమీక్షామహే' దేహధారులైన జీవులెల్లరు పక్షపాతము విడిచి మిక్కిలిప్రేమతో వర్తింతురుగాక! మేమెవ్వరియెడలను అన్యాయయుక్తులమై వర్తింపకుందుముగాక! సర్వమానవులకు నీపరమధర్మమును పరమేశ్వరు డుపదేశించినాడు. ఎల్లరును దీని నంగీకరించుట యుచితము.

( స్తుతి మంత్రము )

ఓ3మ్ తదేవాగ్ని స్తదాదిత్య స్తద్వాయు స్తదుచంద్రమాః

తదేవ శుక్రం తద్ బ్రహ్మ తాఽఆపః స ప్రజాపతిః 4

(య. 32-1)

శ. అ. :- ఓమానవులార! తద్ఏవ = ఆబ్రహ్మమే, అగ్నిః = అగ్ని. తత్ = అదియే, ఆదిత్యః = ఆదిత్యుడు. తద్ = అదియే, వాయుః = వాయువు, తదు = అదియే,

చంద్రమాః = చంద్రుడు, తత్ ఏవ = అదియే, శుక్రమ్ = శుక్రుడు, తద్ = అదియే, బ్రహ్మ=బ్రహ్మము, తాః అపః= అదియే అపస్సు, సః = అతడే, ప్రజాపతిః = ప్రజాపతి.

ద. వ్యా. :- సర్వజగత్తునకు కారణమైన యాపరమేశ్వరుడొక్కడే అగ్నినామముకలవాడు, 'బ్రహ్మహ్యగ్నిః' శతపథము. అగ్నిశబ్దమునకు సర్వోత్తముడు, జ్ఞానస్వరూపుడు, తెలిసికొనదగినవాడు, ప్రాపణీయస్వరూపుడు, పూజ్యతముడు నని యర్థములు. 'ఆదిత్యో వై బ్రహ్మ' వాయుర్ వై బ్రహ్మ, చన్ద్రమా వై బ్రహ్మ, సర్వజగత్కర్తృ బ్రహ్మ, బ్రహ్మ వై బృహత్, ఆపో వై బ్రహ్మ' ఇయ్యవి శతపథ, ఐతరేయ బ్రాహ్మణప్రమాణములు. 'తదాదిత్యః' ఎన్నడు నాశనము లేనివాడు, స్వప్రకాశస్వరూపుడుఅగుటచే పరమేశ్వరునకు ఆదిత్యుడనునామము. 'తద్ వాయుః, సర్వజగత్తును ధరించువాడు, అనంతబలవంతుడు, ప్రాణములకంటె నెక్కుడు ప్రియరూపుడు. అందువలన ఈశ్వరుడు వాయువనబడును. పూర్వోక్తప్రమాణమువలన నతడు చంద్రుడు. అనగా నానందస్వరూపుడు; స్వసేవకులకు పరమానందమునిచ్చువాడు; 'తదేవ శుక్రమ్' అచేతనస్వరూపమగు బ్రహ్మమే సర్వజగత్కర్త. 'తద్ బ్రహ్మ' అయనంతచేతన మందఱకంటె గొప్పది. ధర్మాత్ముడు, అత్యంతసుఖము, విద్య మున్నగుసద్గుణములను వృద్ధిచేయువాడు. "తా అపః" అంతటట వ్యాపించియుండుటవలన నతడే 'అపస్సు' అనబడును. 'స ప్రజాపతిః' అతడే సర్వజగత్తునకు పతి; పాలించువాడు మఱియొకడు లేడు. అతనినే మనము ఇష్టదేవుడని, పాలకుడని యంగీకరింతుము, ఇతరుని కాదు.

(ప్రార్థన)

ఓ౩మ్ ఋచం వాచం ప్రపద్యే మనో యజుః ప్రపద్యే

సామ ప్రాణం ప్రపద్యే చక్షుః శ్రోత్రం ప్రపద్యే

వాగోజః సహౌజో మయి ప్రాణాపానౌ." 5

(య. 36-1)

శ. అ. :- ప్రభూ! నీకృపవలన, ఋచం వాచం ప్రపద్యే = ఋగ్వేదాదివిజ్ఞానయుక్తవాణిని పొందుదునుగాక, యజుః మనః ప్రపద్యే = యజుర్వేదానుకూలమనస్సును పొందుదునుగాక!, సామ ప్రాణం ప్రపద్యే = సామవేదానుకూల నిదిధ్యాసనసహితప్రాణయుక్తుడ నగుదును గాక!, చక్షుః శ్రోత్రం = ఇట్లే నానేత్రములు, చెవులు, ప్రపద్యే = వేదవిద్యాయుక్తము లగుగాక! వాగోజః = వాగ్బలము, సహౌజః = శరీరబలము, ప్రాణాపానౌ = ప్రాణాపానములు, మయి = నాయందు స్థిరములగుగాక!

ద. వ్యా. :- ఓకరుణాకరపరమాత్మా! నీకృపవలన నేను ఋగ్వేదాదిజ్ఞానయుక్తుడను - శ్రవణయుక్తుడనై దానిని చెప్పగలుగుదునుగాక! అట్లే యజుర్వేదాభిప్రాయార్థసహిత సత్యార్థమును మననము చేయగలమనస్సును పొందుదును గాక! మఱియు సామవేదార్థనిశ్చయరూపనిదిధ్యాసనసహిత

ప్రాణమును నిరంతరము పొందుదునుగాక! వాగ్బలము' వక్తృత్వబలము, మనోవిజ్ఞానబలము, నాకు నీవు ప్రసాదింపుము. 'సహౌజః' శరీరబలము, ఆరోగ్యము, దృఢత మున్నగువానితోగూడి నీదయవలన సుగుణవంతుడ నగుదును గాక! 'మయి ప్రాణాపానౌ' ఓసర్వజగజ్జీవనాధార! 'ఊర్ధ్వ చేష్టలను గలిగించు ప్రాణము నిమ్నచేష్టలకు కారణమైన యపానమునను నీరెండును నాశరీరమున సర్వేంద్రియములను, సర్వధాతువులను శుద్ధముచేయుటకు, ఆరోగ్యము. బలము, పుష్టికలిగియుండుటకును తోడ్పడుచు ఆయుర్వర్ధకములు మర్మరక్షకములు నగుగాక! అట్టి ప్రాణాదులను బొంది భగవన్! నీకృపవలన నెల్లపుడు నీయాజ్ఞను పాలించుచు నిన్నుపాసించుచు సుఖపడుదునుగాక!

( స్తుతి మంత్రము )

"ఓ3మ్ స నో బన్ధుర్ జనితా స విధాతా
ధామాని వేద భువనాని విశ్వా
యత్ర దేవా అమృత మానశానా స్తృతీయే
ధామ న్నధ్యైరయన్త." 6 (య. 32-10)

శ. అ. :- సః = ఆప్రభువు, నః = మా, బంధుః = బంధువు, జనితా = ఉత్పాదకుడు, సః = అతడు, విధాతా=

నిర్మాత, విశ్వా = సమస్త, ధామాని = నామములు, స్థానములు, జన్మలు, భువనాని = లోకములు, వేద=ఎఱుగును, యత్ర = ఏపరమేశ్వరునందు, అమృతం = మోక్షమును, అనశానాః = అనుభవించుచు, దేవాః = ముక్తులు, తృతీయే ధామన్ = మోక్షధామమున, అధిఐరయన్త=అధికారపూర్వకముగ తిరుగుదురో !

ద. వ్యా. :- ఆపరమేశ్వరుడు మాకుబంధువు, దుఃఖనాశకుడు; సహాయకుడు, 'జనితా' జగత్తును మమ్ములను పాలించుతండ్రి, మనకార్యముల సిద్ధింపజేయువాడు 'విధాతా' సర్వకార్యములను పూర్ణముచేయువాడతడే, సర్వజగత్తును రచించువాడు నతడే, పాలించువాడు నతడే, మఱియొకడు లేడు. 'ధామాని వేద భువనాని విశ్వా' అనేకలోకలోకాంతరములను రచించి, అనన్తసర్వజ్ఞతతో వానినెఱుగును. విద్వాంసులు, (విద్వాంసో హి దేవాః-శతపథము) మరణాదిదుఃఖములనుండి విడివడి మోక్షపదమున సర్వవ్యాపకుడు, పూర్ణానంద స్వరూపుడునైన పరమేశ్వరుని పొంది సదా ఆనందము ననుభవింతురో ఆపరమేశ్వరుడెవడు ? 'తృతీయే ధామన్' స్థూల జగత్తు పృథివ్యాదులు మొదటిధామము. రెండవధామము సూక్ష్మము - ఆదికారణము-ప్రకృతి, మూడవది - తృతీయ ధామము అనంతానందస్వరూపపరబ్రహ్మము. ఈధామము నందు 'అధ్యైరయన్త' ధర్మాత్ములైనవిద్వాంసులు స్వచ్ఛందముగా విహరింతురు. సర్వబాధలకు దూరులై విజ్ఞానవంతులై శుద్ధులై దేశకాలవ్యవధులకు లోబడక, సర్వగతుడు సర్వాధారుడునైన పరమేశ్వరునందెల్లపుడు నుందురు. జన్మమరణాదిదుఃఖసాగరమున బడరు.

( ప్రార్థన )

ఓ౩మ్ యతో యతః సమీహసే తతో నోఽభయం కురు
శం నః కురు ప్రజాభ్యోఽభయం నః పశుభ్యః 7
(య. 36-22)

శ. అ. :- ఓజగదీశ్వర! యతః యతః = ఏయేస్థానములనుండి నీవు, సమ్ ఈహ సే=చేష్టించుచున్నావో, తతః= అస్థానములనుండి, నః = మాకు. అభయం = నిర్భయతను, కురు = చేకూర్చుము, నః = మా, ప్రజాభ్యః = సంతతి కొఱకు, శం = శుభంకరమగు, అభయం = నిర్భయతను, కురు = చేకూర్చుము, నః = మా, పశుభ్యః=పశువులకును అభయమిమ్ము.

ద. వ్యా. :- ఓపరమేశ్వర ! దయాలూ ! ఏయేవైపుల నుండి నీవు సమీహసే=బాగుగ చేష్టించుచున్నావో. ఆయా ప్రదేశములనుండి మాకు అభయమును చేకూర్చుము. ప్రజల నుండి మాకు శుభము కలిగింపుము. మా సంతానమెల్లపుడు సుఖము ననుభవించునుగాక ! ప్రజలనుండియు, పశువుల నుండియు మాకు నిర్భయత లభించుగాక ! ఎవరివలనను మాకు భయములేక మేము పరమానందము ననుభవింతుము గాక !

( స్తుతి మంత్రము )

ఓ౩మ్ వేదాహమేతం పురుషం మహాన్త మాదిత్యవర్ణం

తమసః పరస్తాత్ తమేవ విదిత్వాతిమృత్యు

మేతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ." 8

(యజు. 31-18)

శ. అ. :- అహం = నేను, ఏతమ్ = ఈ, తమసః పరస్తాత్=అంధకారములేని, ప్రకృతికంటె పరమున, ఆదిత్య వర్ణమ్ = సూర్యసమతేజస్వియైన, మహాన్తమ్ = గొప్ప, పురుషం = పురుషుని, వేద = ఎఱుగుదును, తమేవ = అతనినే, విదిత్వా = తెలిసికొని, మృత్యుం = మృత్యువును, అతి ఏతి = దాటును, అయనాయ = ముక్తికొఱకు, అన్యః = మఱియొక, పన్థాః = మార్గము, న విద్యతే = లేదు.

ద. వ్యా. :- 'సహస్రశీర్షాదివిశేషణోక్త పురుషుడు అంతట పరిపూర్ణుడైయున్నాడు. (పూర్ణత్వాత్ పురి శయనాద్వా పురుష ఇతి నిరుక్తోక్తేః') (పూర్ణుడగుటవలనను, పురమున శయనించుటచేతను పురుషుడనబడునని నిరుక్తము) ఆపురుషుని నేనెఱుగుదును. ఆపరమేశ్వరు నెఱుగుట మానవుల కెల్లరకు సుచితము. అతని నెన్నడు మఱవరాదు. ఇతరు

నీశ్వరునిగా నంగీకరింపరాదు. అపురుషుడెట్టివాడు అన: 'మహాన్తం' గొప్పవారికంటె గొప్పవాడు. అతనికంటె పెద్ద వాడుకాని, సమానుడుకాని లేడు. 'ఆదిత్యవర్ణం' సూర్యాదులను రచించువాడు, వానిని ప్రకాశింపజేయువాడును అతడే. కాని తాను స్వప్రకాశరూపుడు. మఱియు, 'తమసః పరస్తాత్' తమస్సు-అంధకారము అవిద్యాదిదోషములు లేనివాడు, స్వభక్తులను, ధర్మాత్ములను, సత్యప్రియులనుకూడ వెంటనే అవిద్యాదిదోషరహితులం జేయు పరమేశ్వరుడు నతడే. పరబ్రహ్మజ్ఞానము, అతనియనుగ్రహము కలుగక యేజీవుడు నెన్నడు సుఖపడడని విద్వాంసుల నిశ్చయము. 'తమేవ విదిత్వాఽతిమృత్యు మేతి' అతనిని తెలిసికొనియే జీవుడు మృత్యువునుల్లంఘింపగలడు. లేకున్న లేదు, 'నాఽన్యః పన్థా విద్యతేఽయనాయ' పరమేశ్వరునిజ్ఞానము అతనియెడప్రేమకు మించి మఱియొండుమార్గము మోక్షములేదని భగవంతుని దృఢమైనయాజ్ఞ, కావున నెల్లరు దీని నెఱిగి ప్రవర్తింప వలయును. ఇతర జంజాటమున బడరాదు.

( ప్రార్థన )

ఓ౩మ్ తేజోఽసి తేజో మయి ధేహి వీర్యమసి

వీర్యం మయి ధేహి బలమసి

బలం మయి ధేహ్యోజోఽస్యోజో మయి ధేహి

మన్యురసి మన్యుం మయి ధేహి

సహోఽసి సహో మయి ధేహి." 9

(యజు. 19-9)

శ. అ. :- ఓయీశ్వర ! తేజః అసి=నీవు తేజస్స్వరూపుడవు, తేజః మయి ధేహి = నాయందు తేజస్సునుంచుము. వీర్యం అసి = నీవు వీర్యవంతుడవు, వీర్యం మయి ధేహి=నాయందు వీర్యముంచుము, బలమసి = బలవంతుడవు, బలం మయి ధేహి = బలమును నాయందుంచుము. ఓజః అసి = పరాక్రమరూపుడవు, ఓజః మయి ధేహి = పరాక్రమము నాయందుంచుము, మన్యుః అసి = దుష్టశిక్షకుడవు, మన్యుం మయి ధేహి = మన్యువును నాయందుంచుము. సహోసి = సహనస్వరూపుడవు నన్నట్లే చేయుము.

ద. వ్యా. :- ఓస్వప్రకాశ! అనంతతేజ! నీవవిద్యాంధకారరహితుడవు. మఱియు సత్యవిజ్ఞానస్వరూపుడవు, కృపాదృష్టితో నీవు నాయందు తేజస్సును కలిగింపుము. నేను నిస్తేజస్కుఁడను, భయగ్రస్తుడను, దీనుడను కాకుందునుగాక! ఓయనంతవీర్య! పరమాత్మా! నీవు వీర్యస్వరూపుడవు. సర్వోత్తమబలమును నాకు ప్రసాదింపుము. ఓయనంతపరాక్రమ! నీవు ఓజస్వరూపుడవు. నాయందును అట్టి పరాక్రమము కలుగునట్లనుగ్రహింపుము. ఓదుష్టులను శిక్షించుస్వామీ! నాయందును దుష్టులను కోపించుటకును, వారిని దండించుటకును శక్తినొసంగుము. ఓయనంతసహనస్వరూప! నాయందును సహనసామర్థ్యమును కలిగింతువుగాక! శరీరమనోబలములు, ఇంద్రియశక్తి, ఆత్మస్థైర్యము నన్ను విడువకుండునట్లు అనుగ్రహింతువుగాక! అందువలన నేను సదా నిన్ను భక్తితో సేవించుచు నీయనుగ్రహమువలన నీప్రపంచమున సుఖింతునుగాక!

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ పరీత్య భూతాని పరీత్య లోకాన్ పరీత్య సర్వాః
ప్రదిశో దిశశ్చ ఉపస్థాయ ప్రథమజామృతస్యాత్మ
నాత్మా న మభిసంవివేశ." 10 (య. 32-11)

శ. అ. :- భూతాని = సర్వభూతములను, పరీత్య = తెలిసికొని, లోకాన్ = లోకములను, పరీత్య = పూర్ణముగా తెలిసికొని, సర్వాఃదిశః = అన్నిదిక్కులను, ప్రదిశశ్చ = దిక్కోణములను, పరీత్య = తెలిసికొని, ప్రథమజామ్ = ప్రథమోత్పన్నజీవుడు, ఋతస్య=పరమేశ్వరుని, ఉపస్థాయ= సమీపించి, ఆత్మనా=తనఆత్మతో, ఆత్మానం=పరమాత్ముని, అభిసంవివేశ = ప్రవేశింపవలయును.

ద. వ్యా. ;- ప్రకృతిమొదలు పృథివివఱకుగల సమస్త భూతములందును పరమేశ్వరుడు నిండియున్నాడు. అట్లే యన్నిలోకములందు, దిక్కులలోను దిక్కోణములందును పైనక్రింద అంతట నతడులేని కణమైనలేదు. 'ప్రథమజామ్' మొదట పుట్టినజీవు డీప్రపంచము నెఱుగవలయును. సత్యాచరణము, విద్య, శ్రద్ధ, భక్తి, మున్నగువానిమూలమున సత్యస్వరూపుడైన పరమేశ్వరు నెఱింగి యభిముఖుడై యతని యందు ప్రవేశించి, సర్వదుఃఖములకు దూరమై యానందము ననుభవించును.

( ప్రార్థన )

ఓ౩మ్ భగ ప్రణేతర్భగ సత్యరాధో

భగేమాం ధియ ముదవా దదన్నః

భగ ప్రనో జనయ గోభిరశ్వైర్

భగ ప్రనృభిర్ నృవన్తః స్యామ." 11

(య. 34-36)

శ.అ. :- హే భగ !=ఐశ్వర్యయుక్త ! ప్రణేతః=ప్రేరకప్రభూ! హే భగ ! = ఓయైశ్వర్యదాత ! సత్యరాధః = సత్యసిద్ధిప్రద ! హే భగ ! = ఓభజనీయ !, నీవు, ఇమాం = ఈ, ధియమ్ = బుద్ధిని, దదన్ = ఇచ్చుచు, నః = మమ్ము, ఉదవ = రక్షింపుము, హే భగ ! = ఓయైశ్వర్యదాత ! గోభిః = గోవులతో, అశ్వైః = అశ్వములతో, నృభిః = మనుష్యులతో, నః = మమ్ము, ప్రజనయ = సంపన్నులం జేయుము. భగ ! = భగవన్, నృవంతః స్యామ = మంచిమానవులతో వర్ధిల్లుదుము గాక !

ద. వ్యా. ;- ఓపరమైశ్వర్యయుక్త భగవంతా !, 'భగ' ఐశ్వర్యదాతవు ఈప్రపంచమున నీవే. సకలైశ్వర్యము నీయధీ

నమువనే యున్నది. నీవెవరికైనను ఐశ్వర్యము నీయగలవు. దయతో మాదారిద్ర్యమును పోనాడి మమ్ము పరమైశ్వర్య వంతులం జేయుము. ఐశ్వర్యమును పెంపుచేయువాడవు నీవే. 'సత్యరాధః' సత్యమగు నైశ్వర్యమును సిద్ధింపజేయు వాడవు నీవే. కావున మాకు నిత్యైశ్వర్యమును ప్రసాదింపుము. మోక్షమనెడు సత్యైశ్వర్యమును ప్రసాదించువాడవు నీవే. ఓభగ వంతా ! మాకు సర్వోత్తమబుద్ధి నొసంగుము. మేము నీగుణ ముల నలవఱచుకొనుచు నీయాజ్ఞలను పాలింతుముగాక ! సత్యగుణములను, సత్యకర్మలను, సత్యబుద్ధిని 'ఉదవ' ప్రసాదింపుము. అందువలన సూక్ష్మములగు పదార్థముల నెఱుగుదుముగాక ! 'భగ ప్రనో జనయ' ఓసర్వైశ్వర్యోత్పాదక! మాకొఱకు ఐశ్వర్యము నుత్పన్నముచేయుము. ఉత్తమము లగు గోవులు, అశ్వములు, మనుష్యులుగల సంపదలు మాకు చేకూర్చుము. ఓసర్వశక్తిమంతా ! నీకృపవలన మేము ఎల్లప్పుడు ఉత్తమస్త్రీపురుషులు, సంతానము, భృత్యులు గలవార మగుదుముగాక ! మాలో దుష్టుడు మూర్ఖుడు నుండ కుండుగాక ! ఇదియే మాప్రార్థన. మేము సదా సత్కీర్తి మంతుల మగుదుముగాక !

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే
తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః."12
(య. 40-5)

శ.అ. :- తత్ ఏజతి = ఆబ్రహ్మచలించును, తత్ న ఏజతి= అది చలింపదు, తద్ దూరే = అదిదూరము, తద్ అంతికే= అదిసమీపము, తత్ = అది, అస్య సర్వస్య = ఈజగత్తునకు, అంతః = లోపల, తత్ ఉ = అదియే, అస్య సర్వస్య బాహ్యతః = ఈజగత్తునకు వెలుపల ఉన్నది.

ద, వ్యా. :- 'తద్ బ్రహ్మ ఏజతి' ఆపరమేశ్వరుడు ప్రపంచమును తగినట్లు నడపుచున్నాడు. తెలియనివారు చలించుచున్న జగత్తును చూచి పరమేశ్వరుడును చలించుచున్నట్లుతనిలో లేనిచలనము నారోపింతురు. అతడన్నింటిలో పూర్ణుడైయున్నాడు. ఆతడెన్నడును కదలడు. 'తన్నైజతి' అది కదలదని వెంటనే మంత్రము చెప్పుచున్నది. అది యేకరసము-నిశ్చలము. విద్వాంసు లిట్లే బ్రహ్మనంగీకరింతురు. 'తత్ దూరే' అధర్మాత్ములు, అవిద్వాంసులు, విచారశూన్యులు, జితేంద్రియులుకానివారు, ఈశ్వరభక్తిరహితులునైన దుష్టమనుష్యుల కాపరమేశ్వరుడు బహుదూరమున నుండును. అనగా కోట్లకొలదిసంవత్సరములు గడచినను వారతనిని తెలిసికొనజాలరు. అంతవఱకు వారు జన్మజరా

మరణాది దుఃఖములకు లోనగుచుందురు. 'తద్వన్తికే' సత్య వాదులు, సత్యకర్మకారులు, సత్యమును స్వీకరించువారు, జితేంద్రియులు, సర్వోపకారులు విచారశీలురునగు విద్వాంసులు, పరమేశ్వరు నత్యంతసమీపమున జూతురు. ఆపరమేశ్వరు డందఱి యాత్మలందును అంతర్యామియై వ్యాపకుడై అంతట నిండియున్నాడు. అతడాత్మల కాత్మ. పరమేశ్వరు డీజగత్తునకు లోపల వెలుపల నంతట నిండియున్నాడు. నువ్వుగింజంత స్థలముకూడ నతడులేకుండ నుండదు, అతడఖండుడై ఏకరసుడై సర్వమున వ్యాపించియున్నాడు. అతనిని దెలిసికొనుటవలననే ముక్తిసుఖము లభించును. లేకున్నలేదు.

(ప్రార్థన)

"ఓ౩మ్ ఆయుర్ యజ్ఞేన కల్పతామ్ ప్రాణో యజ్ఞేన
కల్పతాం చక్షుర్ యజ్ఞేన కల్పతాం శ్రోత్రం యజ్ఞేన
కల్పతాం వాగ్ యజ్ఞేన కల్పతాం మనో యజ్ఞేన
కల్పతా మాత్మా యజ్ఞేన కల్పతామ్ బ్రహ్మ యజ్ఞేన
కల్పతాం జ్యోతిర్ యజ్ఞేన కల్పతాం స్వర్ యజ్ఞేన
కల్పతాం పృష్ఠం యజ్ఞేన కల్పతాం యజ్ఞో యజ్ఞేన
కల్పతాం స్తోమశ్చ యజుశ్చ ఋక్ చ సామ చ
బృహచ్చ రథన్తరం చ స్వర్దే వా అగన్ మామృతా
అభూమ ప్రజాపతేః ప్రజా అభూమ వేట్ స్వాహా"13

(య. 18-29)

శ. అ. :- ఆయుః = ఆయువు, యజ్ఞేన కల్పతాం = యజ్ఞముతో సఫలమగుగాక! ప్రాణః....తామ్=ప్రాణవాయువు,

చక్షుః = నేత్రము, శ్రోత్రమ్ = చెవి, వాక్=వాక్కు. మనః= మనస్సు, ఆత్మా = జీవుడు, బ్రహ్మ = వేదవేత్త, జ్యోతిః = న్యాయప్రకాశము, స్వః = ఆనందము, పృష్ఠమ్ = జిజ్ఞాస, యజ్ఞః = యజ్ఞము-సంగతవ్యధర్మము, అనునివియన్నియు, యజ్ఞేన కల్పతాం=యజ్ఞమూలమున సమర్థములు-సఫలములు అగుగాక !, స్తోమ = సామయుక్తాథర్వవేదము, యజుః = సత్కార్యసాధకయజుస్సు, ఋక్ = స్తుతిసాధకఋగ్వేదము, సామ = సామవేదము, బృహత్=గొప్పదియగు, రథన్తరమ్= రథన్తరస్తోత్రము, అన్నియు యజ్ఞముతో సమర్థములగుగాక ! దేవాః = విద్వాంసులార ! మేము జన్మమరణరూపదుఃఖముల నుండి విడివడి, స్వః = మోక్షసుఖమును, అగన్మ = పొందుదుముగాక ! ప్రజాపతేః = జగదీశ్వరునకు, ప్రజాః=పాలింపదగినవార మగుదుముగాక ! వేట్=ఉత్తమకర్మతో, స్వాహా! = సత్యవాక్కుతోగూడినవారము, అభూమ = అగుదుముగాక !

ద. వ్యా. :- 'యజ్ఞో వై విష్ణుః, యజ్ఞో వై బ్రహ్మ' ఇత్యాద్యైతరేయ శతపథబ్రాహ్మణ శ్రుతేః' ఈయైతరేయ శతపథబ్రాహ్మణ వాక్యముల ననుసరించి, యజ్ఞమున యజనీయుడు-సర్వమనుష్యులకు, పూజ్యుడు, ఇష్టదేవుడునైన పరమేశ్వరుడు గ్రహింపనగును.

ఆపరమేశ్వరునికొఱకు శ్రద్ధాభక్తులతో సర్వస్వము సమర్పించి యెల్లరు నిట్లు ప్రార్థింపవలయునని యీమంత్ర ముపదేశించుచున్నది. 'ఓసర్వశక్తిమంతుడవగు నీశ్వర ! ఎల్లరు తమపదార్థముల నన్నింటిని నీకర్పింపవలయును. అను నీఆజ్ఞ

ననుసరించి మేము ఆయువు, జీవనము, ప్రాణము, నేత్రములు, చెవులు, వాక్కు, మనస్సు, ఆత్మ. వేదవిద్య, విద్వాంసులు, జ్యోతి-సూర్యాదిలోకములు, అగ్న్యాదిపదార్థములు, యజ్ఞము-మంచిసాధనములు, పృష్ఠము-పృథివ్యాది సర్వలోకములు, స్వర్గము-సుఖసాధనములు, పురుషార్థము, యజ్ఞము-మేము చేయు నుత్తమకర్మలు, స్తోమము, స్తుతి, ఋగ్యజుస్సామాథర్వ వేదములు, బృహద్రథన్తర, మహారథన్తరాది సామములు అన్నిపదార్థములు నీకర్పించుచున్నాము. మేము కేవలము నీశరణుజొచ్చితిమి. నీయిష్టము వచ్చినట్లు మమ్మను గ్రహింపుము.

కాని, మేము నీసంతానము. నీకృపవలన ఉత్తమ (స్వరగన్మ) సుఖమును పొందుదుముగాక! జీవించినంత కాలము చక్రవర్తిరాజ్యము మున్నగుభోగముల ననుభవించుచు సుఖులమగుదుముగాక! మరణానంతరముకూడ మేము సుఖముల ననుభవింతుముగాక! ఓమహాదేవామృత! మేము పరమ విద్వాంసులమగుదుముగాక! నీప్రాప్తియనెడి యమృత మోక్షము మాకు లభించునుగాక! జన్మమరణములను బొందక అమృతస్వరూపులమై యుందుముగాక! 'వేట్ స్వాహా' నీ యాజ్ఞనుపాలించి నిన్నుపొందుదుము. అంతర్యామివగునీ వాజ్ఞా పింపుము. మాహృదయములందు జ్ఞానముననుసరించి మేము భాషింతుముగాక! విపరీతము లాడకుందుముగాక! ఓకృపానిధీ! నీవే మాయోగక్షేమములను జూడుము. నీసాహాయ్యమున మాకు సర్వత్రవిజయము, సుఖము లభించునుగాక!

( స్తుతి మంత్రము )

ఓ౩మ్ యస్మాన్నజాతః పరో అన్యో౽స్తి
య ఆవివేశ భువనాని విశ్వా
ప్రజాపతిః ప్రజయా సంరరాణస్త్రీణి
జ్యోతీంషి సచతే స షోడశీ." 14 (య. 8-36)

శ.అ. - యస్మాత్=ఎవనికంటె, పరః=ఉత్తముడు, అన్యః= ఇతరుడు, న జాతః = పుట్టలేదో, యః = ఎవడు, విశ్వా భువనాని = సమస్తలోకములను, ఆవివేశ = ప్రవేశించి యున్నాడో. సః=అతడు, ప్రజయా=ప్రజతో, సంరరాణః= ఉత్తమదాతయగుచు, షోడశీ = పదునాఱు కళల స్వామి, ప్రజాపతిః=ప్రజాపాలకుడగు పరమేశ్వరుడు, త్రీణి జ్యోతీంషి= మూడు జ్యోతులను. సచతే = అన్నింటియందు నుంచు చున్నాడు.

ద. వ్యా, :- ఎవనికంటె నధికుడుకాని, తుల్యుడుకాని త్రికాలములందు నుండడో, అతడే పరమాత్ముడు. అతడు 'విశ్వాభువనాని' సర్వలోకములకు సర్వపదార్థములకు నివాస స్థానము. అసంఖ్యాతములగు లోకములందన్నిటియందు నిండి యున్నాడు. అతడే యీశ్వరుడు; ప్రజాపతి; ప్రజలనందఱను

రమింపజేయుచు నందఱలో రమించుచున్నాడు. 'త్రీణి జ్యోతీంషి' అగ్ని, వాయువు, సూర్యుల నితడే రచించియున్నాడు. సర్వజగద్వ్యవహారములకు, పదార్థవిద్యలయుత్పత్తికి నీమూడు జ్యోతిస్సులు ముఖ్యములు. 'స షోడశీ' అతడు షోడశకళల నుత్పన్నముచేసెను. అందువలన నతడు షోడశీ-షోడశకళలు కలవాడన బడుచున్నాడు. 1. ఈక్షణము, 2. ప్రాణము, 3. శ్రద్ధా, 4. ఆకాశము, 5. వాయువు, 6. అగ్ని, 7. జలము, 8. పృథివి, 9. ఇంద్రియములు, 10. మనస్సు, 11. అన్నము, 12. వీర్యము-పరాక్రమము, 13, తపస్సు-ధర్మానుష్ఠానము, 14. మంత్రములు-వేదవిద్య, 15. కర్మ, 16. లోకములు-లోకములందు నామములు. ఈకళలయందే సర్వజగత్తు ఉన్నది. పరమేశ్వరునం దనంతకళలున్నవి. అతని నుపాసింపక యితరు నుపాసించువాడు సుఖమును పొందడు.

## ( ప్రార్థన )

"ఓ౩మ్ స నః పితేవ సూనవేఽగ్నే సూపాయనో
భవ సచస్వా నః స్వస్తయే." 15 (య. 3-24)

శ.అ. :- హే అగ్నే != ఓయగ్నీ ! సూనవే పితా ఇవ=కుమారునకు తండ్రివలె, సః = ఆనీవు, నః = మమ్ములను. సు ఉప అయనః = ఉత్తమరీతితో ప్రాప్తించువాడవు, భవ=అగుము. నః = మా, స్వస్తయే = కల్యాణముకొఱకు, సచస్వ=మాతో ఉండుము.

ద. వ్యా. :- 'బ్రహ్మహ్యగ్నిః' అను నీప్రమాణమువలన నిట అగ్నిపదముతో బ్రహ్మ గ్రహింపనగును. ఓవిజ్ఞానస్వరూపాగ్ని! నీవు మాకొఱకు 'సూపాయనః' సులభముగా పొందదగిన వాడవు, ఉత్తమోపాయములను జేర్చువాడవు, ఉత్తమస్థాన దాతవు నగుము, మాకు రక్షకుడవు నీవే, ఓస్వస్తిద! పరమాత్మా! సర్వదుఃఖములను నాశముచేసి మాకు సుఖము గలిగింపుము. 'స నః పితేవ సూనవే' ప్రేమించుతండ్రి కుమారుని సుఖపెట్టునట్లు నీవు మమ్మెల్లపుడు సుఖముగా నుంచుము. మేము చెడిపోయిన నీకే యప్రతిష్ఠ గలుగును. సంతానమును మంచిగా నుంచుటలోనే తండ్రి గొప్పతనము ప్రకటమగును.

(స్తుతి మంత్రము)

"ఓ౩మ్ విభూరసి ప్రవాహణో వహ్నిరసి హవ్యవాహనః

శ్వాత్రోఽసి ప్రచేతా స్తుథోఽసి విశ్వవేదాః". 16

(య. 5-31)

శ. అ. :- ఓప్రభూ! నీవు, విభూరసి = విభుడవు-వ్యాపకుడవు, ప్రవాహణః = వాయువువంటివాడవు, వహ్నిః = అగ్నిసమానుడవు, హవ్యవాహనః = హవ్యవాహనుడవు, అసి= అగుచున్నావు, ప్రచేతాః! = ఎల్లరకుచైతన్యమునొసంగుదేవా! నీవు, 'శ్వాత్రః అసి = విద్వాంసుడవు, విశ్వవేదాః!=విశ్వము

నెఱుంగుదేవా!, తుథః అసి = జ్ఞానమును వృద్ధిచేయు వాడవు నీవే.

ద. వ్యా. :– ఓవ్యాపకేశ్వర ! నీవు విభుడవు. ఎల్లయెడల ప్రకటితమగు వైభవయుక్తుడవు నీవే. నీవు విభుడవై సర్వ జగత్తును నియమపూర్వకముగ నడపువాడవు నీవే. అంతటిని నీవే నిర్వహించుచున్నావు. నీవు వహ్నివి; హవనీయములగు నుత్కృష్టములగు పదార్థములను విభజించి ఆకర్షించి తగు రీతిని స్థాపించువాడవు నీవే. నీవు 'శ్వాత్రః' శీఘ్రవ్యాపకుడవు. ప్రకృష్టజ్ఞానస్వరూపకుడవు, జ్ఞానదాతవు నీవే. ('యథో వై బ్రహ్మ' శతపథము). నీవు సర్వవిదుడవు. అంతటనుండు వాడవు. అంతటను ప్రాప్తింతువు. ఎల్లరకు లాభము చేకూర్చు వాడవు నీవే.

(ప్రార్థన)

"ఓ౩మ్ ఉశిగసి కవిరఙ్ఘారిరసి బంభారిరవస్యూరసి

దువస్వాఞ్ఛున్ధ్యూరసి మార్జాలీయః సమ్రాడసి

కృశానుః పరిషద్యోఽసి పవమానో నభోఽసి

ప్రతక్వా మృష్టోఽసి హవ్యసూదన ఋతధామాసి

స్వర్జ్యోతిః." 17 (య. 5-32)

శ. అ. :- ఓప్రభూ ! నీవు, ఉశిక్=కాంతిమంతుడవు, కవిః అసి = క్రాంతదర్శివి. అంఘారిః అసి=పాపనాశకుడవు, బంభారిః = బంధనశత్రువవు, అవస్యూః అసి=జగత్పాలకుడవు, దువస్వాన్ = ప్రశస్తసేవాయుక్తుడవు, శుర్ధ్యూః అసి= శుద్ధస్వరూపుడవు, మార్జాలీయః = ఎల్లరిని శోధించువాడవు, సమ్రాట్ అసి = బాగుగ ప్రకాశించువాడవు, కృశానుః = దీనులకు సుఖదాతవు, పరిషద్యః = సభలలో న్యాయకారివి, పవమానః అసి = పవిత్రకర్తవు, నభః = నిర్వికారుడవు, హవ్యసూదనః అసి = ద్రవ్యవిభాగకర్తవు, ఋతధామా అసి= ప్రకృతిని ధరించువాడవు, స్వర్జ్యోతిః = అంతరిక్షమును ప్రకాశింపజేయువాడవు.

ద. వ్యా. ;- ఓసర్వప్రియ ! నీవు 'ఉశిక్' కమనీయస్వరూపుడవు. ఎల్లరు నిన్ను కోరుదురు. నీవు 'కవిః' పూర్ణవిద్వాంసుడవు. స్వభక్తుల పాపమును నశింపజేయుదువు. సర్వజగత్పాలకుడవు, అన్నాదిపదార్థములను భక్తులకు ధర్మాత్ములకు నొసంగగోరుదువు. విద్వాంసులకు నీవు సేవనీయతముడవు. నీవు శుద్ధస్వరూపుడవు. సర్వజగత్తును శోధింతువు. నీవు రాజాధిరాజవు. దీనులకు సుఖదాతవు. ఓన్యాయకారీ ! నీవు పవిత్రసభాస్వరూపుడవు, సభాశాసకుడవు; సభ్యుడవు, సభాపతివి, సభాప్రియుడవు. సభారక్షకుడవు నీవే. 'నభ' ఓనిర్వికార ! ఆకాశమువలె క్షోభరహితుడవు, అతిసూక్ష్ముడవగుటచే 'నభ'పదవాచ్యుడవు, 'ప్రతక్వా' సర్వజ్ఞుడవు, సత్యాసత్యకారిజనుల కర్మలకు సాక్షివి. ఎవడెట్టి పాపపుణ్యములొనర్చునో వానికితగిన ఫలవ్యవస్థచేయువాడవు నీవే.

'మృష్టోఽసి' నీవు శుద్ధస్వరూపుడవు. పాపశోధకుడవు 'హవ్యసూదనః' మిష్టములు, సుగంధయుక్తములు, రోగనాశకములు నగు వస్తువులతో వాయువృష్టిజలములను శుద్ధమొనర్చువాడవు నీవే. ఓభగవన్! నీధామము సర్వగతము, సత్యమును, 'స్వః' నీవు సుఖస్వరూపుడవు. సుఖప్రకాశకుడవును.

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ సముద్రోఽసి విశ్వవ్యచా అజోస్యేకపాదహి

రసి బుధ్న్యో వాగస్యైన్ద్రమసి సదోఽస్యృతస్య ద్వారౌ

మా మా సన్తాప్త మధ్వనామధ్వపతే ప్రమాతిర

స్వస్తి మేఽస్మిన్ పథి దేవయానే భూయాత్." 18

(య. 5-33)

శ. అ. :– ఓప్రభూ! నీవు, సముద్రః = ప్రాణులను నడపువాడవు, విశ్వవ్యచాః అసి = జగద్వ్యాపకుడవు, అజః = జన్మలేనివాడవు, ఏకపాత్ అసి = ఏకదేశమున విశ్వముకలవాడవు, అహిః = వ్యాపనశీలుడవు, బుధ్న్యఃఅసి = అంతరిక్షస్థుడవు. వాక్ అసి = వాక్ రూపుడవు, ఐంద్రమసి=ఐశ్వర్యమునకు కారణము నీవే, సదః అసి=స్థానరూపుడవు, ఋతస్య =

సత్యము యొక్క, ద్వారౌ = ద్వారరూపములగు రెండుసుఖము లను నాకొఱకు, మా మా సన్తాప్తమ్ = సంతాపయుక్తము లెన్నడు చేయకుము, అధ్వపతే = మార్గదర్శకస్వామీ! అధ్వనామ్ = పారమార్థిక, వ్యావహారికమార్గములను, మా= నన్ను, ప్రతిర = తరింపజేయుము, దేవయానే=విద్వాంసులు నడవయోగ్యమగు, అస్మిన్‌పథి = ఈమార్గమున, మే=నాకు, స్వస్తి భూయాత్ = కల్యాణముకలుగుగాక!

ద.వ్యా.;-'సముద్రోఽసి విశ్వవ్యచాః' ఓద్రవణీయస్వరూప! సర్వ భూతములు నీయందే చరించుచున్నవి. కార్యకారణరూపమున పరిణమించినవి. నీవే యన్నింటికి కారణము. సమస్తజగత్తును సహజముగా విస్తరింపజేసితివి. 'అజోఽస్యేకపాత్' నీవెన్నడును జన్మించవు. ఈజగత్తంతయు నీలో నేదోయొకమూల నున్నది. నీవనంతుడవు, 'అహిరసి బుధ్న్యః' నీకెన్నడు హీనత కలుగదు. జగత్తునకు మూలకారణము నీవే, అంతరిక్షమున నీవే పూర్ణు డవు. 'వాగస్యైంద్రమసి సదోఽసి' సర్వశాస్త్రోపదేశకుడవు, అనన్తవిద్యాస్వరూపుడవు, నగుటచే 'వాక్' నీవు వాణివి. పర మైశ్వర్యస్వరూపుడవు, విద్వాంసులలో శోభాయమానుడవునగు టచే నీవైంద్రుడవు, సర్వప్రపంచము నీయందున్నది. అందు వలన 'సదః' సభాస్వరూపుడవు. 'ఋతస్య....సంతాప్తమ్' మోక్షస్వరూపుడవగు నిన్నుపొందుటకు సత్యవిద్య, ధర్మము రెండు ద్వారములు. మాకొఱకు వానిని సంతాపయుక్తము

జేయుకు. సుఖస్వరూపులుగా వానిని తెలిచియుంచుము, తేలికగా మేము నిన్ను పొందుదుముగాక! ఓయధ్వపతీ! వ్యావహారిక పారమార్థికమార్గములందు నాకు క్లేశము కలుగకుండుగాక! ఆమార్గమున నాకానందమే ప్రాప్తించునుగాక! ఎట్టిదుఃఖము కలుగకుండుగాక!

( స్తుతిమంత్రము )

"ఓ౩మ్ దేవకృతస్యైనసోఽవయజనమసి మనుష్య
కృతస్యైనసోఽవయజనమసి పితృకృతస్యైనసోఽవ
యజనమస్యాత్మకృతస్యైనసోఽవయజనమ
స్యైనసఽఏనసోఽవయజనమసి యచ్చాహమేనో
విద్వాఀశ్చకార యచ్చావిద్వాఀస్తస్య సర్వస్యైనసోఽవ
యజనమసి." 19 (య. 8-13)

శ.అ. :- దేవకృతస్య=దేవతలచే చేయబడిన, ఏనసః= పాపముయొక్క, అవయజనమసి=నాశకుడవునీవు, మనుష్య... నమసి = మనుష్యకృతపాపములనాశకుడవు, పితృ....యజన మసి=తండ్రిమున్నగు పెద్దలపాపనాశకుడవు, ఆత్మకృతస్య....

మసి = తనచే చేయబడినపాపముల నాశకుడవు నీవే. ఏనసః ఏనసోఽవయజనమసి = పెద్దపాపముల నాశకుడవు నీవే, విద్వాన్ = తెలిసికొనుచు, అహం = నేను, యత్ ఏనః చకార = ఏపాపము చేసితినో, అవిద్వాన్ యత్ చ=తెలియక చేసినపాపమును, తస్య సర్వస్య ఏనసః = ఆసర్వపాపమును, అవయజనమ్ అసి = దూరముచేయువాడవు నీవే.

ద. వ్యా. :- ఓసర్వపాపప్రణాశక! "దేవకృతస్య .... అవయజనమసి" ఇంద్రియములు, విద్వాంసులు, దివ్యగుణములుగలజనులు, ఇట్లే పరమవిద్వాంసులగుపితరులు చేయు పాపములను నశింపజేయువాడవు నీవే. మఱియొకడు లేడు. ఇట్లే జీవుడు చేయుపాపములు, మహాపాపములు అన్నియు నశింపజేయువాడవు నీవే. నీవు 'అవయజన' సర్వపాపరహితుడవు, మనుష్యులమగు మాపాపముల నన్నింటిని దూరము చేయగలదయామయుడవగు తండ్రివి నీవే. ఓమహానంత విద్య! తెలిసి, తెలియక నేను చేసినపాపములను విడిపింప గలవాడవు నీవుతక్క మఱియొకడెవడున్నాడు? నీవే మాకు శరణ్యుడవు. కావున మాయందుగల యవిద్యాదిసర్వపాపములను దూరముచేసి శీఘ్రముగా మమ్ము శుద్ధులం జేయుము.

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః
పతిరేక ఆసీత్ స దాధార పృథివీం ద్యాముతేమాం
కస్మై దేవాయ హవిషా విధేమ." 20

(య. 13-4)

శ. అ.:- హిరణ్యగర్భః = తేజస్సులు గర్భమునగల ఈశ్వరుడు, అగ్రే=సృష్టికిపూర్వమున, సమవర్తత=ఉండెను, అతడు, భూతస్య = పుట్టినజగత్తునకు, ఏకః పతిః = ఒకే స్వామి, జాతః ఆసీత్ = ప్రసిద్ధుడై యుండెను, సః=అతడు, పృథివీం .= భూమిని, ఉత ఇమాం ద్యామ్ = ఈద్యులోకమునుకూడ, దాధార = ధరించియున్నాడు, కస్మై = సుఖస్వరూపుడైన, దేవాయ = దేవునకు, హవిషా = యజ్ఞముతో, విధేమ = పూజచేయుదుము.

ద, వ్యా. :- సృష్టిలేనపుడుఒకయద్వితీయుడైన హిరణ్యగర్భుడు-సూర్యాదితేజోమయపదార్థములకు గర్భము-ఉత్పత్తిస్థానముగా ఉండెను. అతడే ప్రథముడు. ఆతడు సర్వజగత్తునకు సనాతన ప్రాదుర్భూతప్రసిద్ధపతియై యున్నాడు. అపరమేశ్వరుడే పృథివిమొదలు ప్రకృతివఱకుగల ప్రపంచమును రచించి ధరించియున్నాడు. (కస్మై=ప్రజాపతయే, కః=ప్రజాపతిః, ప్రజాపతిర్ వై కః తస్మై ప్రజాపతయే. శతపథే) ప్రజా

పతియైన పరమాత్మనకు అత్మాదిపదార్థములన్నియు సమ
ర్పించి యతని నుపాసింపవలయును. ఆతనికంటె భిన్నుని
లేశమాత్రమైనను మనము ఉపాసింపరాదు. పరమేశ్వరుని
విడిచి యతనిస్థానమున అన్యుని పూజించువానికి, వానిదేశ
మున కంతటికి మిక్కిలి దుర్దశ కలుగును. ఇయ్యది ప్రసిద్ధము.
దీనినిబట్టి తెలిసికొనుము. మానవులార! మీరు సుఖము
కోరుదురేని నిరాకారుడైన పరమేశ్వరునొక్కనినే భక్తితో
సేవించుడు. మఱియొకవిధమున మీకు సుఖమెన్నడు
కలుగదు.

( ప్రార్థన )

"ఓ౩మ్ ఇన్ద్రో విశ్వస్య రాజతి

శం నో అస్తు ద్విపదే శం చతుష్పదే." 21

(య. 36-8)

శ. అ. :- ఇంద్రః = ఇంద్రుడు, విశ్వస్య=ఈప్రపంచ
ముపై, రాజతి = రాజ్యముచేయుచున్నాడు, నః = మా,
ద్విపదే= ద్విపాత్తులకు, చతుష్పదే = చతుష్పాత్తులకు, శం=
సుఖము, అస్తు = అగుగాక !

ద. వ్యా. :- ఓయిన్ద్ర! నీవు పరమైశ్వర్యయుక్తుడవు,
సమస్తప్రపంచమునకు రాజవు-ప్రకాశకుడవు, ఓరక్షక! నీవు

కృపతో, మా 'ద్విపదే' రెండుపాదములుగల పుత్రకళత్రాదులకు పరమసుఖము నొసంగుదువుగాక ! అట్లే 'చతుష్పదే' నాలుగు పాదములుగల మా గజ తురగ గవాదిపశువులను సుఖముగా జీవించునట్లనుగ్రహింతువుగాక ! అందువలన మాకు సదా ఆనందము లభించును.

( ప్రార్థన)

"ఓ౩మ్ శంనో వాతః పవతాం శంన స్తపతు సూర్యః
శం నః కనిక్రదద్దేవః పర్జన్యో అభివర్షతు." 22

(య. 36-10)

శ. అ. :- ఓరక్షక !, నః = మాకు, వాతః=వాయువు, శం పవతామ్ = సుఖదాయకమై ప్రవహించుగాక ! సూర్యః = సూర్యుడు, నః = మాకు, శమ్ తపతు=సుఖకరుడై తపించుగాక ! దేవః పర్జన్యః = దివ్యగుణయుక్తమేఘము, నః = మాకు, కనిక్రదద్=గర్జించుచు, శం అభివర్షతు=సుఖమును వర్షించుగాక !

ద. వ్యా. :- ఓసర్వనియంతా ! ప్రభూ ! మాకొఱకు వాయువు సుగంధయుక్తమై శుభకారకమగుచు మందమందముగా వీచునుగాక ! ఇట్లే సూర్యుడుకూడ సుఖకారకుడై

తపించునుగాక ! అట్లే మేఘముకూడ శ్రవణసుఖముగా గర్జించుచు సమయసమయమున సుఖకారకమై వర్షించును గాక ! నీదయకు పాత్రులమై మేమెల్లవేళల సుఖముతో జీవింతుముగాక !

( ప్రార్థన )

"ఓ౩మ్ అహాని శం భవన్తు నః శం రాత్రీః ప్రతిధీయతామ్
శం న ఇన్ద్రాగ్నీ భవతామవోభిః
శం న ఇన్ద్రావరుణా రాతహవ్యా
శం న ఇన్ద్రాపూషణా వాజసాతౌ శమిన్ద్రాసోమా
సువితాయ శంయోః" 23 (యజు.36-11)

శ. అ.-ఓ ప్రభూ ! అవోభిః = రక్షణలతో, శంయోః=సుఖమును, సువితాయ = ప్రేరేపించుటకు, అహాని = దినములు, నః = మాకు, శం భవన్తు = సుఖకారకములగునుగాక ! రాత్రీః = రాత్రులు, శం ప్రతి = సుఖమునుగూర్చి, ధీయతాం=మమ్ము ధరించుగాక !, ఇంద్రాగ్నీ = అగ్నివిద్యుత్తులు, నః శం భవతామ్ = మాకు సుఖదాయకములగుగాక ! రాతహవ్యా = అపేక్షితపదార్థములనొసంగు, మేఘము, జలములు, నః శమ్=

మాకు, కల్యాణకారకములగుగాక, వాజసాతౌ = యుద్ధమందు, ఇంద్రాపూషణా = వాయుపూషులు, నః శం=మాకు సుఖదములగుగాక, ఇంద్రాసోమా = సూర్యచంద్రులు, నః శమ్ = మాకు సుఖకారకు లగుదురుగాక !

ద. వ్యా :- ఓక్షణాదికాలపతీ ! నీనియమము ననుసరించి దినములన్నియు మాకు సుఖరూపములగుగాక ! రాత్రులుకూడ సుఖముగా గడచునుగాక ! ఓభగవంతా ! దినరాత్రులను సుఖకారకములగునట్లు నీవు ధరింపుము. అందువలననే మేము నిరంతరము సుఖింతుముగాక ! ఓసర్వస్వామీ! సూర్యాదులు, నీయనుగ్రహమున రక్షణవిధులతో మాకు సుఖకారకు లగుదురుగాక ! ఓప్రాణాధార ! వాయువు చంద్రుడు హోమాదులకారణముగా శుద్ధగుణయుక్తములై మాకు సుఖము నొసంగుగాక ! ఓప్రాణపతీ ! నీరక్షణలో మేము పూర్ణాయువుగలవారమై బలయుక్తప్రాణములతోగూడి యుద్ధమున నత్యంతపురుషార్థముతో స్థిరముగా నుందుముగాక ! శత్రుసమ్ముఖమున మేమెన్నడు నిర్బలులము కాకుందుముగాక! (ఇన్ద్రా సోమా సువితాయ శంయోః 'ప్రాణాపానౌ ఇంద్రాగ్నీ' శతపథము) ఓమహారాజ ! నీవ్యవస్థలో, రాజు ప్రజలు పరస్పరము విద్యాదిసత్యగుణయుక్తులై తమయైశ్వర్యము నుత్పన్నము చేసికొందురుగాక ! నీకృపవలన ప్రీతియుక్తులై మిక్కిలిసుఖలాభమును పొందుదురుగాక ! సుఖము ననుభవించుమమ్ము జూచి నీవు ప్రసన్నుడవగుదువు. మేము నీసత్యాజ్ఞలను పరిపాలింతుము.

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ ప్రతద్వోచేదమృతంను విద్వాన్

గన్ధర్వో ధామ విభృతం గుహా సత్

త్రీణి పదాని నిహితా గుహాస్య యస్తాని వేద

స పితుః పితాऽసత్." 24 (య. 32-69)

శ. అ. :- గంధర్వః=వేదవాణినిధరించిన, విద్వాన్ను= జ్ఞానియే, తత్ సత్ = ఆ సత్యస్వరూపుడగు, అమృతమ్ = నాశరహితుడు, ధామ = తేజస్వియు, గుహా విభృతమ్ = హృదయగుహలోనున్న ప్రభువునుగూర్చి, ప్రవోచేత్=బాగుగ ఉపదేశించును. అస్య పితుః = ఈజగత్పితయొక్క, గుహా నిహితా=మిక్కిలిదాగియున్న, త్రీణి పదాని=మూడుఅవస్థలు, యః = ఎవడు, తాని వేద = వాని నెఱుంగునో, సః=అతడే, పితా అసత్ = జ్ఞానియగును.

ద. వ్యా. :- ఓసర్వశాస్త్రప్రతిపాద్య! విద్వత్ప్రతిపాద్య! అమృత! నీవు సర్వగతుడవు, సర్వాధారుడవు, సర్వపోషకుడవు, సర్వసాక్షివి. నీఉపదేశము నెఱిగి నిన్ను ధరించు విద్వాంసుడు గంధర్వుడనిపించుకొనును. అట్లే పరమాత్ముని మూడుపదములు-సృష్టిస్థితిలయములు, పరమేశ్వరుడు తండ్రులకు తండ్రి, విద్వాంసులకు విద్వాంసుడు.

( ప్రార్థన )

"ఓ౩మ్ ద్యౌః శాన్తి రంతరిక్షం శాన్తిః పృథివీ శాన్తి
రాపః శాంతిరోషధయః శాన్తిః వనస్పతయః
శాన్తిర్ విశ్వేదేవాః శాన్తిర్ బ్రహ్మ శాన్తిః సర్వం శాన్తి
శ్శాన్తిరేవ శాన్తిః సా మా శాన్తి రేధి." 25

(య. 36-17)

శ. అ. :- ద్యౌః=ద్యులోకము, శాన్తిః=శాంతికరము, అంతరిక్షం=అంతరిక్షము, శాన్తిః=శాంతిదాయకము, పృథివీ = భూమి, ఆపః = జలము, ఓషధయః = ఓషధులు, వనస్పతయః=వనస్పతులు, విశ్వేదేవాః=సమస్తదేవతలు, బ్రహ్మ= బ్రహ్మము, సర్వం=సర్వము, శాన్తిః=శాన్తి, ఇవి యన్నియు శాంతిధాయకము లగుగాక ! ఆ శాన్తిసుఖము నాకు ప్రాప్తమగుగాక !

ద. వ్యా. :- సర్వదుఃఖములను శాంతమొనర్చుదేవా! అందఱిపైనుండు ఆకాశము, అంతరిక్షస్థలోకములు, పదార్థములు, విద్వాంసులు, బ్రహ్మము, అన్నియు సుఖదాయకము లగుగాక ! శాంతినిచ్చుగాక ! ఆసుఖశాంతులు నాకు లభించి నేను వృద్ధిని బొందుదునుగాక !

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ నమః శంభవాయ చ మయోభవాయ చ
నమః శంకరాయ చ మయస్కరాయ చ
నమః శివాయ చ శివతరాయ చ." 26

(యజు. 16-41)

శ. అ. :- శంభవాయ నమః = శంభవునకు నమస్కారము, మయోభవాయ నమః = సుఖస్వరూపునకు నమస్సు, శంకరాయ చ నమః = శాంతికారకునకు నమస్సు, మయస్కరాయ చ నమః = సుఖదాతకు నమస్కారము, శివాయ శివతరాయ చ నమః = మంగళమయునకు నమస్సు,

ద. వ్యా. :- ఓకల్యాణరూప ! కల్యాణకర ! నీవు శంభవుడవు, మోక్షసుఖస్వరూపుడవు. మోక్షసుఖదాతవు, నీకు నమస్కారము. నీవు మయోభవుడవు, సాంసారికసుఖముల నొసంగునీకు నమస్కారము. నీవు శంకరుడవు, నీవలననే జీవులకు కల్యాణము కలుగును. ఇతరునివలన కలుగదు. అట్లే మయస్కరుడవు, మనస్సు, ఇంద్రియములు, ప్రాణములు, ఆత్మ అనువీనికి సుఖమునిచ్చువాడవు నీవే. నీవు శివుడవు-మంగళమయుడవు, శివతరుడవు - అనంతకల్యాణ

స్వరూపుడవు-కల్యాణకారకుడవు, నీకు మాటిమాటికి నమస్కరించుచున్నాము. (నమో నమ ఇతి యజ్ఞః శతపథే) శ్రద్ధా భక్తులతో నీశ్వరునకు నమస్కరించువాడు మంగళమయుడగును.

## (ప్రార్థన)

"ఓ3మ్ భద్రం కర్ణేభిః శృణుయామ దేవా

భద్రం పశ్యేమాక్షభిర్ యజత్రాః

స్థిరైరఙ్గై స్తుష్టువాంస స్తనూభిర్

వ్యశేమహి దేవహితం యదాయుః." 27

(యజు. 25-21)

శ. అ. :- కర్ణేభిః = చెవులతో, భద్రం శృణుయామ= శుభోపదేశము విందుముగాక !, అక్షభిః = కన్నులతో, భద్రం పశ్యేమ=శుభదృశ్యము చూతుముగాక !, యజత్రాః దేవాః= యాజకులగు విద్వాంసులు, స్థిరైః అంగైః=స్థిరావయవములతో కూడిన, తనూభిః = శరీరములతో, తుష్టువాంసః=ఈశ్వరుని ప్రశంసించుచు, దేవహితం = విద్వాంసులకు హితముసేయ, ఆయుః వ్యశేమహి = పూర్ణమగు నాయువును పొందుదుము గాక !

ద. వ్యా. :- ఓదేవేశ్వర! విద్వాంసులార! మేము చెవులతో కల్యాణమునే విందుముగాక! అకల్యాణమును వినకుందుముగాక! ఓయజనీయేశ్వర! ఓయజ్ఞకర్తలార! కన్నులతో భద్రమునే చూతుముగాక! ఓజగదీశ్వర! మాయంగములు ఉపాంగములు ఎల్లప్పుడు దృఢములుగా నుండుగాక! స్థిరతతో మేము నిన్ను స్తుతించుచు, నీయాజ్ఞలను పాలింతుముగాక! అందువలన మేము విద్వాంసులకు హితముచేయదగిన దృఢత యింద్రియాదులలో కలిగి పూర్ణాయువును పొంది సుఖింతుముగాక!

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ బ్రహ్మ జజ్ఞానం ప్రథమం పురస్తాద్ విసీమతః
సురుచో వేన ఆవః స బుధ్న్యా ఉపమా అస్య విష్ఠాః
సతశ్చయోని మసతశ్చ వివః." 28

(యజు. 13-3)

శ. అ. :- పురస్తాత్ = సృష్టికిపూర్వము, జజ్ఞానమ్ = సర్వము నుత్పన్నముచేయు, ప్రథమమ్ = వ్యాపకము, సురుచః = సుందరప్రకాశయుక్తము, వేనః = కమనీయమునగు, బ్రహ్మ = అన్నిటికంటె పెద్దదియగు బ్రహ్మమేదికలదో, విష్ఠాః = వివిధస్థలములలోనున్న, బుధ్న్యాః = సూర్యాది

లోకములు, అస్య = ఈబ్రహ్మమునకే, ఉపమాః=దృష్టాంతములు, సః = ఆపరమేశ్వరుడు, అవః=వానినన్నింటిని తన వ్యాప్తితో కప్పియున్నాడు. విసీమతః = సీమతో, సతః = వ్యక్తము, అసతః=అవ్యక్తమునగు జగత్తునకు, యోనిమ్= ఆకాశరూపకారణస్థానమును, వివః = గ్రహించుచున్నాడు.

ద. వ్యా. :- ఓమహీయపరమేశ్వర! నీవు గొప్పవారికంటె గొప్పవాడవు, నీకు తుల్యుడెవడును లేడు. 'జజ్ఞానమ్' సర్వజగద్వ్యాపకుడవు. జగత్తునకాదికారణము నీవే. సీమాయుక్తములగు సూర్యాదిలోకములు నీచేతనే ప్రకాశింపజేయబడినవి. వానిని రచియించి నీవే ధరించియున్నావు. 'విఆవః' ఈలోకములన్నింటిని వివిధరూపములలో వివిధనియమములతో నడపించుచున్నావు. 'వేనః' కమనీయుడవు. ఆనందస్వరూపుడవగుటచే నిన్ను కామించనివాడు లోకమున నుండడు. అనంతవిద్యాయుక్తుడవు నీవే. 'బుధ్న్యాః' అంతరిక్షమునగల పదార్థములను పరమేశ్వరుడే విభజించును. అంతరిక్షాదులు లోకవ్యవహారము లందుపయుక్తము లగుచున్నవి. వివిధజగత్తునకవి నివాసస్థానములు. 'సత్ అసత్' ఈవ్యక్తావ్యక్తప్రపంచమునకాదికారణము నీవే యని విద్వాంసులనుడువుదురు. అందువలన నీజగత్తునకంతటికిని మాతవు, పితవు నీవే. మాకు భజనీయ ఇష్టదేవుడవు నీవే.

## ( ప్రార్థన )

"ఓ౩మ్ సుమిత్రియా న అప ఓషధయః సన్తు
దుర్మిత్రియా స్తస్మై సన్తు
యోఽస్మాన్ ద్వేష్టి యఞ్చ వయం ద్విష్మః." 29
(య. 36-23)

శ. అ. :- ఓ ప్రభూ ! అప ఓషధయః = జలము, ఓషధులు, నః = మాకు, సుమిత్రియాః = హితకారకములు, సన్తు = అగుగాక, యః=ఎవడు, అస్మాన్=మమ్ము. ద్వేష్టి= ద్వేషించునో, యం చ =ఎవనిని, వయం= మేము, ద్విష్మః= ద్వేషింతుమో, తస్మై = అతనికి, దుర్మిత్రియాః = దుఃఖ కారకములు, సన్తు = అగుగాక !

ద. వ్యా. :- ఓ సర్వమిత్రసంపాదక ! నీ కృపవలన ప్రాణములు, జలము, విద్య, ఓషధులు అన్నియు, మాకొఱకు 'సుమిత్రియాః' సదా సుఖదాయకము లగుగాక !, ఎన్నడు ప్రతికూలములు కాకుండుగాక. మాకు శత్రువై మమ్ము ద్వేషించుచు. మాయెడ ప్రీతికలిగి యుండనివ్యక్తికి ఆ ప్రాణాదులే దుఃఖకారకము లగుగాక ! మేము ద్వేషించునట్టి దుష్టునకు నా ప్రాణాదులు "దుర్మిత్రియాః' ప్రతికూలములై దుఃఖ కారకము లగుగాక !

( ప్రార్థన )

"ఓ౩మ్ య ఇమా విశ్వా భువనాని జుహ్వాదృషిర్ హోతా
న్యసీదత్ పితా నః స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః
ప్రథమ చ్ఛదవరాఀ2 ఆవివేశ." 30

(యజు. 17-17)

శ. అ. :- యః నః పితా = మనపాలకుడు, హోతా= హవనము, దానముచేయువాడు, ఋషిః = సర్వజ్ఞుడునగు పరమేశ్వరుడు, ఇమా విశ్వా = ఈసమస్త, భువనాని = లోకములను, జుహ్వాత్ = హవనము - జీవుల కర్పణము చేయుచు, న్యసీదత్ = ఉన్నాడు, సః = అతడు, ఆశిషా= సఫలతతో, ద్రవిణమిచ్ఛమానః = సుఖాదులను జీవులకొఱకు కోరువాడై, ప్రథమచ్ఛత్ = శ్రేష్ఠుడగుచు, అవరాన్ = వ్యాప్య పదార్థములను, ఆవివేశ = ప్రవేశించి వ్యాపకుడైయున్నాడు.

ద. వ్యా. ;- 'హోతా' సృష్టిసమయమున పదార్థములను జీవులకొసంగువాడు, ప్రళయకాలమున వానిని తిరిగి గ్రహించువాడును పరమేశ్వరుడే. 'ఋషిః' సర్వజ్ఞుడగు నాపరమేశ్వరుడు లోకలోకాంతరములను తన సామర్థ్యముతో ప్రళయకాలమున హోమముచేయుచు నిత్య మవస్థితుడై యుండును. అతడే మనకు పిత-పాలకుడు. మరల 'ద్రవిణమ్' ద్రవ్యరూపమగు నాజగత్తును స్వేచ్ఛతో నుత్పన్నము

చేయగోరును. 'ఆశిషా' అతనిసామర్థ్యముతోనే వివిధరూపమున నీజగత్తును అవలీలగా సృష్టించును. 'ప్రథమచ్ఛత్' చరాచరాత్మకమగు నీవిశాలజగత్తును రచించి యందాయనంత స్వరూపుడు వ్యాపకుడై యున్నాడు; సాక్షిరూపమున నంతర్యామిరూపమున నందు ప్రవిష్టుడై యున్నాడు. ఈజగత్తునకు లోపల వెలుపల నంతట నోతప్రోతుడై యున్నాడు. అతడే మనకు నిశ్చితముగా పిత. అతనిని సేవించుట మాని పాషాణాదులచే నిర్మించిన మూర్తులను సేవించువాడు కృతఘ్నతాది మహాదోషయుక్తుడై యెల్లపుడు దుఃఖముల ననుభవించును. పరమదయామయుడగు నాతండ్రియాజ్ఞలను పాలించువాడు సదా సర్వానందమును అనుభవించును.

(స్తుతిమంత్రము)

"ఓ౩మ్ ఇషే పిన్వస్వ ఊర్జే పిన్వస్వ బ్రహ్మణే పిన్వస్వ
క్షత్రాయ పిన్వస్వ ద్యావా పృథివీభ్యాం పిన్వస్వ
ధర్మాసి సుధర్మ అమేన్యస్మే నృమ్ణాని ధారయ
బ్రహ్మ ధారయ క్షత్రం ధారయ విశం ధారయ "31

(య. 38-14)

శ. అ. :- సుధర్మ = ధర్మశీలప్రభూ !, ధర్మ = ధర్మ ధారకుడవు, అమేని = నిర్వైరుడవు, అసి = ఐతివి, అస్మే= మా, నృమ్ణాని = ధనములను, ధారయ = ధరించుము, బ్రహ్మ = బ్రహ్మతేజస్సును, ధారయ = ధరించుము, క్షత్రం ధారయ = క్షాత్రమును ధరించుము, విశం ధారయ=వాణిజ్య బుద్ధిని ధరించుము, ఓసర్వసుఖదాత ! మమ్ములను, ఇషే = అన్నముకొఱకు, పిన్వస్వ = పుష్టిగలవారిని జేయుము, ఊర్జే= పరాక్రమముకొఱకు, బ్రహ్మణే = వేదజ్ఞానముకొఱకు, క్షత్రాయ = చక్రవర్తిరాజ్యసుఖముకొఱకు, ద్యావాపృథివీభ్యామ్ = ఐహికపారలౌకికసుఖభోగముకొఱకు మమ్ములను, పిన్వస్వ = పుష్టిమంతులం జేయుము.

ద. వ్యా. :- ఓసర్వసౌఖ్యప్రదేశ్వర ! మమ్ము, 'ఇషే' అన్నముకొఱకు పుష్టిమంతులం జేయుము. అన్నము జీర్ణము కానందున నేర్పడురోగములనుండి మమ్ము కాపాడుము. అన్నాభావముచే మేమెన్నడును బాధపడకుందుముగాక ! ఓమహాబల ! 'ఊర్జే' పరాక్రమవంతుల మగుదుముగాక ! ఓవేదోత్పాదక ! 'బ్రహ్మణే' సత్యయుక్తవేదవిద్యను బొందుట కావశ్యకమగు బుద్ధిబలము మాకు చేకూర్చుము. ఓమహారాజాధిరాజ పరబ్రహ్మన్ ! 'క్షత్రాయ' అఖండచక్రవర్తి రాజ్యప్రాప్తికావశ్యకమగు శౌర్యముధైర్యము, నీతి, వినయము, పరాక్రమము, బలాది-ఉత్తమగుణముల నొసంగి దయతో మమ్ము పుష్టిమంతులం జేయుము. మేమెన్నడు పరాధీనులము గాకుందుముగాక ! 'ద్యావాపృథివీభ్యాం' మోక్షసుఖము, సాంసారికసుఖము ననుభవింపదగు సామర్థ్యము నొసంగుము. ఓధర్మశీల ! నీవు ధర్మస్వరూపుడవు. దయతో మమ్ము ధర్మా

త్మ్మలం జేయుము. 'అమేని' నీవు నిర్వైరుడవు; మమ్మ్మ నిర్వైరులం జేయుము. 'అస్మే' కృపతో మాకు 'నృమ్ణాని' విద్య, పురుషార్థము, గజతురంగములు, సువర్ణము, రత్న ములు, రాజ్యము మున్నగునుత్తమపదార్థములను చేకూర్చుము. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు ఎల్లరు వారివర్ణోచితగుణాదు లతోగూడి దేశభక్తులై సుఖము లనుభవించునట్లనుగ్రహింతురు గాక !

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ కింస్విదాసీ దధిష్ఠాన మారంభణం కతమత్ స్విత్

కథాసీత్ యతో భూమిం జనయన్ విశ్వకర్మా

విద్యామౌర్ణోన్మహినా శ్వచక్షాః" 32

(యజు. 17-18)

శ. అ. ;- అధిష్ఠానమ్=ఆధారము, కింస్విత్ ఆసీత్= ఏమియుండెను ? ఆరంభణమ్ = ఉపాదానకారణము, కతమత్స్విత్ = ఏది ?, కథా ఆసీత్=ఎట్లుండెను ?, యతః= దేనినుండి, విశ్వచక్షాః = సర్వజ్ఞుడు, విశ్వకర్మా = విశ్వకర్త; భూమిం ద్యామ్ = భూద్యులోకములను, జనయన్ = సృష్టించుచు, మహినా=మహిమతో, విఔర్ణోత్ = వ్యాపించి యున్నాడు.

ద. వ్యా. :- ప్రశ్న : ఈజగత్తునకాధారమేమి ? ఉత్పాదకకారణ మేమి ? అది యెట్టిది ? రచయితయగు నీశ్వరున కధిష్ఠాన మేది? ఈశ్వరునకు, జగత్తునకు నిమిత్తకారణములు-సాధనములేమి ?

ఉత్తరము :- 'యతః' విశ్వకర్మయగు పరమేశ్వరుడు తన యనంతసామర్థ్యముతో నీజగత్తును రచించెను. అతడే దీనికాధారము-నిమిత్తకారణమును, అతడే తన మహిమతో నీజగత్తును రచియించి 'ఔర్ణోత్' దానిని తన వ్యాపకతతో కప్పియున్నాడు. అతని కధిష్ఠానము మఱియెవరును లేరు. అన్నింటిని పుట్టించి రక్షించి ధరించుచున్నాడు. ఆనందమయుడతడు. 'విశ్వవ్యచాః' విశ్వద్రష్ట, అట్టివానిని విడిచి యన్యు నాశ్రయించువాడు దుఃఖములపాలగును.

( ప్రార్థన)

"ఓ౩మ్ తనూపా అగ్నేఽసి తన్వం మే పాహి

ఆయుర్దా అగ్నేఽస్యాయుర్ మే దేహి వర్చోదా

అగ్నేఽసి వర్చో మే దేహి అగ్నే యన్మే తన్వా

ఊనం తన్మ ఆపృణ." ౩౩ (య. 3-17)

శ. అ. :- అగ్నే ! = జ్ఞానస్వరూపా ! తనూపా అసి = శరీరరక్షకుడవు, మే తన్వ పాహి = నాతనువును రక్షింపుము. అగ్నే=అగ్నీ ! ఆయుర్ దాఽసి=ఆయుప్రదాతవు, మే ఆయుః దేహి = జీవనము నిమ్ము, వర్చోదాః అసి = వర్చస్సు నిచ్చు వాడవు, మే వర్చః దేహి=నాకు వర్చస్సు నిమ్ము, అగ్నే ! యన్ మే తన్వా ఊనమ్ = నా శరీరమునగల కొఱతను, తత్ మే ఆపృణ = పూర్ణము చేయుము.

ద. వ్యా. :- ఓసర్వరక్షకేశ్వరాగ్నే ! నీవు మా శరీర రక్షకుడవు. మా శరీరమును కృపతో నీవు రక్షింతువుగాక ! నీవు జీవనవర్ధకుడవు. సుఖముతో నెక్కుడుకాలము జీవింప జేయుము. 'వర్చః' విద్యాదితేజస్సును-యథార్థవిజ్ఞానము నిచ్చువాడవు, నాకు దాని నొసంగుము. మా శరీరములను రక్షించుచు 'ఊనమ్' దానిలోని కొఱతలను తొలగించి పూర్ణము చేయుదువుగాక ! మేము పూర్ణమైన యానందము ననుభవింతుముగాక ! పిల్లలు తమకు కావలసినవానిని తలిదండ్రులను విడిచి ఇతరుల నెవరినర్థింతురు ? నీవు మాకోర్కెలను పూర్ణమొనర్చుము.

## (ప్రార్థన)

"ఓ౩మ్ విశ్వత శ్చక్షురుత విశ్వతోముఖో
విశ్వతో బాహురుత విశ్వతస్పాత్
సంబాహుభ్యాం ధమతి సంపతత్రైర్
ద్యావా భూమీ జనయన్ దేవ ఏకః." 34

(య. 17-19)

శ. అ. :- విశ్వతః చక్షుః=అంతటచక్షువులు కలవాడు, ఉత విశ్వతః ముఖః = అంతట ముఖములున్నవాడు; విశ్వతః బాహుః = అంతట బాహువులు కలవాడు, ఉత విశ్వతః పాత్ = మఱియు నంతట పాదములు కలవాడు. అట్టి పరమేశ్వరుడు, బాహుభ్యాం=బలపరాక్రమముల నెడు బాహువులతో, పతత్రైః = పొందింపదగు సుఖదుఃఖముల నెడు ఫలములతో. సంధమతి = జీవులకు గతికల్పించుచున్నాడు, ఏకః దేవః = అయద్వితీయుడే, ద్యావా భూమీ జనయత్ = ద్యు పృథివీలోకముల నుత్పన్నము చేయుచున్నాడు.

ద.వ్యా. ;-పరమేశ్వరునకు విశ్వమున నంతట నేత్రములున్నవి. అతడు చూడనిది యుండదు. అట్లే యతనికి, బాహువులు, ముఖములు, పాదములు శ్రోత్రాదులు నంతట

నుండును. కావున సర్వద్రష్ట, సర్వోపదేష్ట, సర్వాధారకుడు, సర్వగతుడై యున్నాడు. అతనికి భయపడువాడు ధర్మాత్ము డగును. ఆతడద్వితీయుడు. సర్వజగత్కర్తయు, సుఖదుఃఖ రూపఫలముల నిచ్చుచు జీవులకు గతినిచ్చుచున్నాడు. అట్టి న్యాయకారుని విడిచి యన్యుని సేవింపరాదు. అతడనంతుడు, సర్వశక్తిమంతుడు, దయామయుడు, పూజ్యుడు, ప్రభువు.

( స్తుతి మంత్రము )

"ఓ3మ్ భూర్భువః స్వః సుప్రజాః ప్రజాభిః స్యాం

సువీరో వీరైః సుపోషః పోషైః

నర్య ప్రజాం మే పాహి శంస్య పశూన్ మే పాహి

అథర్య పితుమ్ మే పాహి." 35

(య. 3-37)

శ. అ. :- భూః = సదావర్తమాన !, భువః = చేతన స్వరూప ! స్వః = ఆనందరూప !, ప్రజాభిః = సంతతితో, సుప్రజాః స్యామ్ = మంచిసంతతిగలవార మగుదుముగాక !, వీరైః = వీరులతో, సువీరః = మంచివీరులుగలవారము, పోషైః = పుష్టికరవ్యవహారములతో, సుపోషః=మంచిపోషణ

మును, ఈలోకముల నన్నింటిని దేనినుండి రచించెనో యదియే వృక్షము, వనము. ఓ (మనీషిణః) విద్వాంసులార! భువనముల నన్నింటిని ధరించి దానిపై విరాజిల్లు నతనినిగూర్చి ప్రశ్నింపుడు, నిశ్చయించుడు. అతని (మనసా) నెఱుగుట వలననే జీవులకు కల్యాణము కలుగును-లేకున్న కలుగదు.

## (ప్రార్థన)

"ఓ౩మ్ తచ్చక్షుర్ దేవహితం పురస్తాచ్ఛుక్ర ముచ్చరత్
పశ్యేమ శరదః శతం జీవేమ శరదః శతం శృణుయామ
శరదః శతం ప్రబ్రవామ శరదః శతమదీనాః స్యామ
శరదః శతం భూయశ్చ శరదః శతాత్." 37

(య. 36-24)

శ. అ. :- తత్ = అబ్రహ్మము, శుక్రమ్ = శుద్ధము, దేవహితం = దేవహితకరము, చక్షుః=సర్వద్రష్ట, పురస్తాత్= ఎదుట, ఉచ్చరత్ = ఉన్నది, దానినే, శరదః శతమ్ = నూఱేండ్లు, పశ్యేమ=చూతుముగాక, శతం శరదః జీవేమ= నూఱేండ్లు జీవింతుముగాక!....శృణుయామ = అతనిగుణము

లను విందుముగాక !....ప్రబ్రవామ = నూఱేండ్లు గుణగానము చేయుదుముగాక ! .... అదీనాః స్యామ = దీనులము కాకుందుముగాక ! శతాత్ శరదః భూయః=నూఱేండ్లకంటె నెక్కుడు కాలము చూతుము, విందుము, గుణగానము మొదలైనవి చేయుదుముగాక !

ద. వ్యా. :- ఆ బ్రహ్మము (చక్షుః) సర్వమును చూచు చేతనము. విద్వాంసులకు, ఇంద్రియములకు, మనస్సునకు హితముచేయు మోక్షసుఖము నిచ్చునది. 'పురస్తాత్' అన్నింటికి ఆదికారణము. (శుక్రమ్) సర్వకర్త, శుద్ధస్వరూపముగలది. 'ఉచ్చరత్' ప్రళయానంతరముండునది - ఆ బ్రహ్మకృపవలన మనము నూఱేండ్లు చూతుము; జీవింతుము; విందుము, మాటలాడుదుము. అదీనుల మగుదుము. మా యింద్రియములు శరీరము స్వాస్థ్యము కలిగియుండును. నూఱేండ్లకంటె ఎక్కువకాలము ఈశ్వరకృపవలన సుఖముగా ఉందుముగాక!

( ప్రార్థన )

"ఓ3మ్ యా తే ధామాని పరమాణి యాఽవమా యా
మధ్యమా విశ్వకర్మన్నుతే మా శిక్షా సఖిభ్యో హవిషి
స్వధావః స్వయంయజస్వ తన్వం వృధానః" 38

(య. 17-21)

శ. అ. :- విశ్వకర్మన్ ! = సృష్టికర్తవగునో దేవా! తే ధామాని = నీధామములు, యా పరమాణి=ఏవి యున్నతములో, యా మధ్యమా=ఏవి మధ్యమములో, యా అవమా=ఏవి నిమ్నములో, ఇమా = వీనిని, సఖిభ్యః = జీవులకొఱకు, శిక్ష = జ్ఞానము కలిగింపుము, స్వధావః = ఓ అన్నదాత! తన్వం = మాశరీరవృద్ధికొఱకు, హవిషి = పదార్థములను, యజస్వ = ప్రదానముచేయుము.

ద. వ్యా. :- ఓసర్వవిధాయకేశ్వర ! నీ చే ర చి యి ం ప బడిన ఉత్తమ, మధ్యమాధమ లోకములజ్ఞానమును నీసఖులమైన మాకు గలిగింపుము. వాని యథార్థజ్ఞానమువలన మేమన్నిలోకములందును సుఖముగా నుందుము. ఈలోకములందు దానగ్రహణాదివ్యవహారములలో మేము దక్షులమగుదుముగాక ! 'హేస్వధావః!' నీవు సామర్థ్యముకలవాడవు. మాశరీరాదులను వృద్ధిచేయువాడవు నీవే. మేము విద్వాంసులను సత్కరించుచు వారిసాంగత్యముచే జ్ఞానాదులను పొందునట్లు, దానాదులనొనర్చునట్లు అనుగ్రహింపుము. మేము నిన్ను సేవింపజాలము. ప్రసన్నుని జేయజాలము. అయినను దయతో నీవు మమ్ము సుఖింపజేయుము.

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ యన్మే ఛిద్రం చక్షుషో హృదయస్య

మనసో వాతి తృణ్ణం బృహస్పతిర్ మే తద్దధాతు

శం నో భవతు భువనస్య యస్పతిః." 39

(య. 36-2)

శ. అ. :- యత్ = ఏది, మే=నా, చక్షుషః = కంటి యొక్క, హృదయస్య= హృదయము యొక్క, నా, మనసః= మనస్సుయొక్క. అతితృణ్ణం = మిక్కిలిగా భిన్నమైన, ఛిద్రం = ఛిద్రము-దోషము-కలదో, తత్ = ఆ, మే=నాదోష మును, బృహస్పతిః=పరమేశ్వరుడు, దధాతు=సరిచేయును గాక !, యః = ఎవడు, భువనస్య = లోకమునకు, పతిః = స్వామియో, సః నః = అతడే మాకు, శం = కల్యాణదాత, భవతు = అగుగాక !

ద. వ్యా. :- ఓసర్వసంధాయకేశ్వర ! నా నేత్రము, హృదయము, మనస్సు, బుద్ధి, విజ్ఞానము, విద్య, సర్వేంద్రి యములు ననువీనిలోగల నిర్బలతను పోనాడుము. రాగద్వేష ములు, చాంచల్యము, మన్దతమున్నగు వికారములను బోనాడి సత్యధర్మాదులను ధరించునట్లు చేయుము. మేము నీయాజ్ఞలను పాలింతుముగాక ! నా దోషముల నన్నింటిని పోనాడుము.

నీవు భువనపతివి. మాకు కల్యాణము నొసంగుము. నీప్రార్థన నెల్లపుడు చేయుదుము. నిన్ను మించి మాకు శుభము చేకూర్చువాడెవడున్నాడు ? నిన్నే విశ్వసించుచున్నాము. మా యాశలను నీవే పూర్ణముచేయుము.

( ప్రార్థన )

"ఓ౩మ్ విశ్వకర్మా విమనా అద్విహాయా ధాతా
విధాతా పరమోత సందృక్ తేషా మిష్టాని సమిషా
మదన్తి యత్రా సప్త ఋషీన్ పరఽఏకమాహుః 40
(య. 17-26)

శ. అ. :- విశ్వకర్మా = సృష్టికర్త, విమనా=నానావిధ విజ్ఞానయుక్తుడు, విహాయా = సర్వవ్యాపకుడు, ధాతా = సర్వాధారుడు, విధాతా = సర్వకర్త, సందృక్ = సర్వద్రష్ట, పరః = సర్వోత్తముడునైన పరమేశ్వరుని, ఏకమ్=అద్వితీయుడుగా, ఆహుః = చెప్పుదురు, అత్ = మఱియు, యత్ర = ఎవనియందు, సప్త ఋషీన్=సప్తఋషులను పొంది, ఇషా= కోరికతో జీవులు, సంమదన్తి=ఆనందమును అనుభవించునో,

ఉత = మఱియు, తేషామ్=ఆజీవులకు, పరమా ఇష్టాని = ఉత్తమకోరికలను పరమేశ్వరుడు తీర్చును.

ద. వ్యా. :- ఓసర్వజ్ఞప్రభూ ! నీవు విశ్వకర్తవు. వివిధ విజ్ఞానశాలివి, సర్వవ్యాపకుడవు, నిర్వికారుడవు, ఆకాశమువలె అక్షోభ్యుడవు, జగదాధారుడవు, జగదుత్పాదకుడవు, సర్వోత్కృష్టుడవు, సర్వపాపపుణ్యద్రష్టవు, అట్టి నిన్ను భక్తితో విశ్వసించి సేవించువానికి నిన్ను విడిచి యన్యుని సేవింపనివానికి ఇష్ట సుఖముల నొసంగుదువు. ఈశ్వరుడు భక్తులను సుఖింప జేయును. భక్తులతనిలో ఆనందింతురు. అతనిలోనే యుండి దుఃఖములపాలు కారు. పరమేశ్వరుడద్వితీయుడు. అతని సామర్థ్యమువలన లోకములు-పంచప్రాణములు, అంతఃకరణము, జీవుడు నన్నియు ప్రళయవిషయకములై కారణభూతములై యుండును. పరమేశ్వరుడు సదా నిర్వికారుడై యుండును. అతని నుపాసించియే మనము సుఖింతుము.

( స్తుతి మంత్రము )

"ఓ3మ్ చతుః స్రక్తిర్నాభిర్ ఋతస్య సప్రథాః

స నో విశ్వాయుః సప్రథాః స నః సర్వాయుః

సప్రథాః అపద్వేషోఽఅప హ్వారోఽన్యవ్రతస్య సశ్చిమ

41 (య. 38-20)

శ. అ. :- ఓ ప్రభూ ! చతుః స్రక్తిః = నాల్గుకోణములు గల, నాభిః=నాభివంటి, సప్రథాః = విస్తృతమనుష్యునివలె, అన్యవ్రతస్య = ఇతరునిరక్షించు, ఋతస్య=సత్యపురుషుడు నీవాడే యగును. అట్లే, సః = ఆ, సప్రథాః = విస్తృతకార్యములుగల, విశ్వాయుః = పూర్ణాయువుగల పురుషుడు, నః= మాకొఱకు, సః = అతడు, సప్రథాః=మిక్కిలిసుఖయుక్తుడు, సర్వాయుః = పూర్ణాయువుగలవాడు. నః = మా హితసాధకుడగుగాక ! ద్వేషః = ద్వేషించువారిని, అపసశ్చిమః=దూరము చేయుదుముగాక ! హ్వారః=కుటిలురను, అప=తొలగింతుముగాక !

ద. వ్యా. :- ఓసర్వరోగనాశక ! నీకృపవలన, నాల్గు కోణములుగల మర్మస్థానము ఋతంభరమై, ఆరోగ్యవంతమై విజ్ఞాననిలయమై మిక్కిలిసుఖము కలదగుగాక ! పూర్ణాయువు కలదగుగాక ! నీవు నీసామర్థ్యముతో మమ్ము పూర్ణాయువులం జేయుము. ఓశాంతస్వరూప ! నీకృపవలన ద్వేషరహితులము

చలనరహితులము నగుదుముగాక! నీయాజ్ఞను పాలించుచు నిన్నే యీశ్వరునిగా నంగీకరింతుము. ఇదియే మా వ్రతము. నిన్ను సదా సేవింతుము. ఈ మా నిశ్చయమును నీవు కాపాడుము.

## ( ప్రార్థన )

"ఓ౩మ్ యో నః పితా జనితా యో విధాతా

ధామాని వేద భువనాని విశ్వా! యో దేవానాం నామధా

ఏక ఏవ తం సంప్రశ్నం భువనా యన్త్యన్యా." 42

(య. 17-27)

శ. అ. :- యః = ఎవడు, నః = మమ్ము, జనితా = పుట్టించువాడో, పితా = పాలకుడో, యః విధాతా = ఎవడు కర్మఫలవిధాయకుడో, విశ్వా = సమస్త, ధామాని=జన్మములను, భువనాని = లోకములను, వేద = ఎఱుగునో, యః దేవానామ్ = దేవతల, నామధా = నామకరణముచేయునో, ఏకః ఏవ = అతడొక్కడే, తమ్ = ఆ, సంప్రశ్నం=పరమేశ్వరుని, అన్యాభువనా = ఇతరప్రాణులు, యాన్తి = పొందుచున్నవి.

ద. వ్యా. ;- ఓమానవులార! పాలకుడు, జనకుడు, మోక్షసుఖదాత, లోకలోకాంతరముల నెఱుగువాడునైన పరమేశ్వరు డంతట నుండును. సూర్యాదిలోకములకు ఇంద్రియాదిదేవతలకు నామకరణముచేయువాడు నతడే. మఱియొకడు లేడు. అతడే మనకు పిత, స్వామి; ప్రశ్నోత్తరముల మూలమున విద్వాంసు లతనినే పొందుదురు. అతనియాజ్ఞలను పాలించుట, జగత్తును బాగుగ నెఱిగి నిశ్చయించుటయే పురుషార్థము. కావున తనుమనోధనములతో పరమాత్మ నెఱుంగ యత్నించుచు ధర్మాదుల సాధించుట యెల్లరకు తగును.

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ యజ్జాగ్రతో దూరముదైతి దైవం

తదు సుప్తస్య తథైవైతి దూరంగమం జ్యోతిషాం

జ్యోతి రేకం తన్మే మనః శివసంకల్ప మస్తు." 43

(య. 34-1)

శ. అ. ;- యత్ దైవమ్ = ఏది దివ్యమో, జాగ్రతః = మేలుకొనియున్నవానికి, దూరమ్ ఉదైతి = దూరము పోవునో, సుప్తస్య = నిద్రపోవువానికి, ఉ తథైవైతి = అట్లే దూరము

పోవునో, తత్ = ఆ, దూరంగమం = దూరము వెళ్లు, జ్యోతిషాం = ఇంద్రియములకు, ఏకం జ్యోతిః = ముఖ్యజ్యోతియో, మే మనః = ఆ నామనస్సు, శివసంకల్పం అస్తు = మంచి సంకల్పములు కలదియగుగాక !

ద. వ్యా. :- ఓరక్షకా ! పరమాత్మా ! నా మనస్సు నీకృపవలన ఎల్లప్పుడు మంచిసంకల్పములు కలదియగుగాక ! ఆ మనస్సెట్టిది ? జాగ్రదవస్థలో దూరము పోవును-వచ్చును. దానికది స్వభావము. ఇంద్రియాదులకు ప్రకాశము నిచ్చుజ్యోతి-మనస్సు లేకున్న లోకమున నేవస్తువు తెలియదు. అది చంచలము, వేగవంతము, అట్టిది నీకృపవలననే స్థిరపడును, ధర్మయుక్తమగును, విద్యావంతమగును, ఆత్మకది ముఖ్యసాధనము, త్రికాలముల నెఱుగుసాధనము. అది నీవశముననే ఉన్నది. నీవు దానిని మావశము చేయుము. మేము కుకర్మలు చేయక, ధర్మములం జేయుచు నీసేవయందనురక్తుల మగుదుముగాక !

( ప్రార్థన )

ఓ౩మ్ న తం విదాథ య ఇమా జజానాన్యద్

యుష్మాకమంతరం బభూవ నీహారేణ ప్రావృతాః

జల్ప్యా బాసుతృప ఉక్థశాసశ్చరంతి." 44

(య. 17-31)

శ. అ. :- యః ఇమాః జజాన = ఎవడీ లోకముల నిర్మించెనో, న తం విదాథ=నీవతని నెఱుగవు. యుష్మాకం= మీలో, అన్యత్ = భిన్నమైన, అంతరం=బాధకము. బభూవ= ఉన్నది, నీహారేణ ప్రావృతాః = అజ్ఞానముతో అవృతులై, జల్ప్యాః = వ్యర్థాలాపములాడుచు, ఉక్థశాసః అసుతృపః చరన్తి = ప్రాణపోషకులై తిరుగుదురు.

ద. వ్యా. :- ఓజీవా ! పరమేశ్వరు డీలోకములను రచించును. అతనిని నీవెఱుగవు. మిక్కలి అజ్ఞానముచే మీరావృతులై యున్నారు. నాస్తికులు మిథ్యావాదు లగుచున్నారు. మీరు స్వార్థసాధకులై ప్రాణపోషణచేసికొనుచున్నారు. అవైదికులై విషయలోలురై జీవించుచున్నారు. కావుననే అతనిని మీరెఱుగరు. జీవేశ్వరులు భిన్నులు. ఏకమెన్నడును కారు. జీవుడవిద్యాదిదోషయుక్తుడు, ఈశ్వరుడు సర్వజ్ఞుడు. కావున వారిరువురు ఏకము కారు. సర్వదా భిన్నులే. వ్యాప్యవ్యాపక, అధారాధేయ, జన్యజనకసంబంధములు జీవునితో ఈశ్వరునకు గలవు. జీవేశ్వరు లిరువురేకమని యెంచుట తగదు.

( ప్రార్థన )

"ఓ౩మ్ భగ ఏవ భగవాఀ అస్తు దేవా స్తేన
వయం భగవన్తః స్యామ తం త్వా భగ సర్వ
ఇజ్జో హవీతి స నో భగ పుర ఏతా భవేహ." 45

(య. 34-38)

శ. అ. :- భగవాన్ = భగవంతుడు, భగః ఏవ అస్తు= భజనీయుడగుగాక ! తేన = అతనితోకూడిన, దేవాః వయమ్= విద్వాంసులమగు మేము, భగవన్తః స్యామ= ఐశ్వర్యవంతుల మగుదుముగాక !, భగ = ఈశ్వర ! తమ్ త్వా = అట్టినిన్ను, సర్వః ఇత్ = అందఱు, జోహవీతి=పూజింతురు, హే భగ != ఓస్వామీ ! సః = ఆ నీవు, ఇహ = ఈలోకమున, నః = మాకు, పురః ఏతాభవ = అగ్రగామివి అగుము.

ద. వ్యా. :- ఓసర్వాధిపతీ ! మహారాజేశ్వర ! నీవు 'భగః' ఐశ్వర్యస్వరూపుడవు. కావున భగవంతుడవు. ఓ విద్వాంసులార ! అతనిసాహాయ్యముతో పరమైశ్వర్యవంతు లగుడు. ఓభగ ! భజనీయదేవ! ప్రపంచమంతయు నిన్ను గ్రహింప నుత్సహించును : లోకమున నిన్ను బొందనిచ్ఛగింపని భాగ్యహీను డెవడుండును ? కావున నీవు మాకు మొదట

లభింతువుగాక! ఎన్నడు నీవు కాని, ఐశ్వర్యము కాని మమ్ము విడువకుండుగాక! నీవు కృపతో ఈజన్మమునందే పరమైశ్వర్యము మాచే ననుభవింప జేయుము.

(ప్రార్థన)

"ఓ౩మ్ గణానాం త్వా గణపతిం హవామహే
ప్రియాణాం త్వా ప్రియపతిం హవామహే
నిధీనాం త్వా నిధిపతిం హవామహే వసో మమ
అహమజాని గర్భధమా త్వమజాసి గర్భధమ్." 46

(య. 23-19)

శ. అ. :- ఓప్రభూ! గణానాం = గణములకు, గణపతిం = పాలకుడవగు, త్వా = నిన్ను, హవామహే=పూజింతుము, ప్రియాణాం = ప్రియులకు, ప్రియపతిం = ప్రియపాలకుడవగు, త్వా = నిన్ను, హవామహే=ఆహ్వానింతుము, నిధీనామ్ = నిధులకు, నిధిపతిం=స్వామివగు, త్వా = నిన్ను, హవామహే = ప్రశంసింతుము, వసో = అందఱిలోనుండు స్వామీ! నీవు, మమ = నా వాడవు, గర్భధమ్=ప్రపంచము గర్భమునందుకల ప్రకృతిని. త్వమ్ = నీవు, ఆ అజాసి =

బాగుగ ప్రాప్తించియున్నావు, అహం = నేను, గర్భధం = ప్రకృతిధారకుడవగు నిన్ను, ఆ అజాని=బాగుగ నెఱుగుదును గాక !

ద. వ్యా. ;- ఓ సమూహాధిపతీ! నీవు నా 'గణ' సర్వ సమూహములకు స్వామివగుటచే నిన్ను గణపతియని గ్రహింతును. నాకు ప్రియమొనర్చు పదార్థములకు, జనులకు పాలకుడవు. అందువలన ప్రియపతివగు నిన్ను తప్పక యెఱుగుదునుగాక! నీవు నానిధులకన్నింటికి నిశ్చితపతి వగుటచే నిన్ను నిధిపతిగా నెఱుంగుదునుగాక! 'వసో' సర్వజగత్తు నుత్పన్నముచేయగల సామర్థ్యమును ధరించునోప్రభూ! నిన్ను నేనెఱుంగుదునుగాక ! సర్వకారణమగు నీసామర్థ్యమే యీ జగత్తును ధరించి పోషించుచున్నది. ఈప్రపంచము తద్గత ప్రాణిజాతము పుట్టి నశించును. నీవు మాత్ర మజన్ముడవు-అమృతస్వరూపుడవు. నీకృపవలన అధర్మమును, అవిద్యను, దుష్టభావములను 'అజాని' దూరము చేయుదునుగాక! మే మెల్లరము నిన్నే మిక్కిలిస్పర్థతో 'హవామహే' ప్రాప్తింప గోరుచున్నాము. నీవు శీఘ్రముగా మాకు లభింతువుగాక! మాకు లభించుటలో నేకొంచెము నీవు విలంబనము చేసినను మా సర్వస్వము వ్యర్థమగును.

(ప్రార్థన)

"ఓ౩మ్ అగ్నే వ్రతపతే వ్రతం చరిష్యామి
తచ్ఛకేయమ్ తన్మే రాధ్యతామ్
ఇద మహ మనృతాత్ సత్య ముపైమి." 47

(య. 1-5)

శ. అ. :- వ్రతపతే = ఓ వ్రతరక్షక ! అగ్నే ! = పరమేశ్వర !, వ్రతం = వ్రతమును, చరిష్యామి = గ్రహింపగోరుచున్నాను, తత్ = దానిని, శకేయమ్ = నిర్వహింపగలుగుదునుగాక ! మే = నా. తద్ ఇదమ్=వ్రతము, రాధ్యతామ్= సఫలమగుగాక !, అహమ్ = నేను, అనృతాత్ = అనృతమునుండి, సత్యమ్ ఉపైమి = సత్యమును పొందుదునుగాక !

ద. వ్యా. :- ఓసచ్చిదానంద ! స్వప్రకాశరూప ! ఈశ్వరాగ్నే! బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సంన్యాసము మున్నగువ్రతములను పాలింతును, నీవు కృపతో వానిని సఫలము చేయుము. నేను అనిత్యములగు శరీరాదులను వీడి, యథార్థమై యెన్నడు నాశమునొందని సత్యాచరణము, విద్య మున్నగు లక్షణములుగల ధర్మమును నేను పొందగోరుచున్నాను. నాకోర్కెను సఫలము చేయుము. నేను సభ్యుడను, విద్వాంసుడను, సత్యాచరణగలవాడనై భక్తితో నిన్ను సేవించు ధర్మాత్ముడ నగుదునుగాక !

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ య ఆత్మదా బలదా యస్య విశ్వఽ
ఉపాసతే ప్రశిషం యస్య దేవాః
యస్య చ్ఛాయాఽమృతం యస్య మృత్యుః
కస్మై దేవాయ హవిషా విధేమ." 48

(య. 25-13)

శ. అ. :- యః = ఎవడు, ఆత్మదాః = శరీరాదుల నొసంగునో, బలదాః = బలదాతయో, విశ్వే=ఎల్లరు, యస్య= ఎవనిని, ఉపాసతే = ఉపాసింతురో, దేవాః=విద్వాంసులు, యస్య = ఎవని, ప్రశిషమ్ = శాసనమును, అంగీకరింతురో, యస్య ఛాయా = ఎవనిఆశ్రయము, అమృతం = జీవనమో, యస్య = ఎవనిఅనాశ్రయము, మృత్యుః= మృత్యువో, కస్మై= అసుఖరూప, దేవాయ = దేవునికొఱకు, హవిషా = సామర్థ్యముతో. విధేమ = పూజింతుము.

ద. వ్యా. :- ఓ మానవులార! ఏపరమేశ్వరుడు మనకు 'ఆత్మదాః' ఆత్మబలము నిచ్చువాడో, 'బలదాః' వివిధములగు బలముల-శారీరిక, మానసిక, ఆధ్యాత్మికబలముల నొసంగు

వాడో, యెవనిశాసనమును విద్వాంసులు, ప్రాణి అప్రాణజగత్తు ఎన్నడు ఉల్లంఘింపజాలరో, ఎవని 'ఛాయా' ఆశ్రయము విజ్ఞానవంతులకు మోక్షదాయకమో అట్లే, యెవని అనాశ్రయము, 'అచ్ఛాయా' అకృప-దుష్టులకు మాటిమాటికి జన్మ మరణరూపమహాకష్టములను కలిగించునో యతడే మనకు పరమసుఖముల నొసంగుతండ్రి. ఓసజ్జనులార! మిత్రులార! రండు-మనమందఱము కలిసిభక్తిశ్రద్ధలతో నతనినిభజింతము. ఎన్నడు నతనిని విడిచి యన్యుని సేవింపకుందుముగాక! అతడు మనకత్యంతసుఖముల నిచ్చుననుటలో నెట్టిసందేహము లేదు.

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ ఉపహూతా ఇహ గావ ఉపహూతో
అజావయః అథో అన్నస్య కీలాల ఉపహూతో
గృహేషు నః క్షేమాయ వః శాన్త్యై
ప్రపద్యే శివం శగ్మం శంయోః శంయోః." 49

(య. 3-43)

శ. అ. :- ఇహ = ఈలోకమున. వః = మీయొక్క, శాన్త్యై = సుఖము, నః = మాకు, క్షేమాయ = మేలుకొఱకు,

గృహేషు = గృహములందు, గావః=గోవులు, ఉపహూతాః= లభించినవి, అజావయః = మేకలు గొఱ్ఱెలు, ఉపహూతాః = ప్రాప్తించినవి, అథో = తరువాత, అన్నస్య కీలాలః = అన్న రానులు, ఉపహూతః=ప్రాప్తించినవి, ఓస్వామీ ! శంయోః= ఈసుఖసాధనలతో, శివమ్ = శుభము, శంయోః=సుఖసాధన లతో, శగ్మం=ఉత్తమసుఖమును, ప్రపద్యే=పొందుదునుగాక!

ద. వ్యా. :- ఓపశుపతీ ! నీకృపవలననే ఉత్తమ పశువులు గోవులు, గేదెలు, గుఱ్ఱములు, ఏనుగులు, మేకలు, గొఱ్ఱెలు మున్నగునవియు, అన్నరసము, రోగనాశకములగు ఓషధులు మాకు స్థిరముగా లభించునుగాక ! పదార్థములులేక మేమెన్నడుదుఃఖముల ననుభవింపకుందుముగాక! ఓవిద్వాంసు లార ! 'వః' మీసంఘము ఈశ్వరునికృపవలన క్షేమము, కుశ లత, శాంతి, సర్వోపద్రవవినాశముకొఱకు 'శివమ్' మోక్షసుఖ మును పొందింపజేయునుగాక ! ఓపరమేశ్వర మోక్షసుఖము ప్రజాసుఖము నభిలషించు నా యీరెండుకోరికలు తగిన విధమున నీవు పూర్ణము చేయుదువుగాక ! ఓభగవంతా ! భక్తులకోరికలు తీర్చుటయే నీస్వభావముకదా !

## ( ప్రార్థన )

"ఓ౩మ్ తమీశానం జగతస్తస్థుషస్పతిం

ధియం జిన్వ మవసే హూమహే వయమ్

పూషా నో యథా వేదసా మసద్ వృధే

రక్షితా పాయు రదబ్ధః స్వస్తయే." 50

(ఋ. 1-6-15-5)

శ. అ. :- వయమ్ = మనమందఱము, అవసే = రక్షణకొఱకు, తం = ఆ, జగతః తస్థుషః పతిం = స్థావర జంగమాత్మకజగత్తునకు పతియు, ధియం జిన్వమ్ = బుద్ధి వర్ధకుడు నగు, ఈశానం = ఈశ్వరుని, హూమహే = ప్రార్థన చేయుదము, యథా = అందువలన, పూషా=పోషకుడగు నీశ్వరుడు, నః = మన, వేదసామ్ = ధనములయు, జ్ఞానములయు, వృధే = వృద్ధికొఱకు, స్వస్తయే = మేలుకొఱకు, రక్షితా = రక్షకుడు, అదబ్ధః = అణచబడని, పాయుః = సంరక్షకుడు, అసత్ = అగుగాక !

ద. వ్యా. :- సుఖము, మోక్షము కోరు నో మానవులార ! అపరమేశ్వరుని పొందుటకు మిక్కలి స్పర్థతో మీరు ప్రయత్నింతురు. అతనిని మనమందఱము కలిసికొందము. ఈ జగత్తున కతడే యీశుడు. అతడే యీ జగత్తు నుత్పన్నము

చేయుటకు ఈక్షించును. ఈజగత్తు చరము అచరమునని రెండు విధములు, ఈరెండువిధములగు జగత్తు నతడే పాలించుచున్నాడు. 'ధియమ్‌జిన్వం' విజ్ఞానమయుడు, విజ్ఞానప్రదుడు, తృప్తికారకుడునగు నీశ్వరునికంటె మించినవాడు మఱియొకడెవడున్నాడు ? అతనినే రక్షణకొఱకు మనము స్పర్థతో ఆహ్వానింతుము. అతడే 'పూషా' మనపోషకుడు. 'వేదసాం' విజ్ఞానాది ధనములను రక్షించు 'రక్షితా' రక్షకుడు నతడే. 'స్వస్తయే' నిరుపద్రవతతో మనలను పాలించు 'పాయుః' పాలకుడు నతడే. అతడు 'అదబ్ధః' హింసారహితుడు. కావున, నిరాకారుడు, సర్వానందప్రదుడునగు నాపరమేశ్వరుని నెన్నడు నోమానవులార ! మఱవకుడు. అతడే సుఖములకు నిధానము.

## ( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ మయీద మింద్ర ! ఇంద్రియం దధాత్వస్మాన్
రాయో మఘవానః సచన్తామ్ అస్మాకం
సంత్వాశిషః సత్యా నః సంత్వాశిషః." 51

(య. 2-10)

శ. అ. :- ఇంద్ర ! పరమేశ్వర !, మయి =నాయందు, ఇదం = ఈ, ఇంద్రియం = ఇంద్రియమును, దధాతు = స్థాపించుము, మఘవానః = ఓధనవంతా !, రాయః=ధనము,

అస్మాన్ = మమ్ములను, సచంతామ్ = ప్రాప్తించుగాక !, అస్మాకం = మా, ఆశిషః = కోరికలు, సత్యాః సన్తు=సత్యములగుగాక !, నః = మా ఆశలు సత్యములగుగాక !

ద. వ్యా. :- ఓయింద్ర ! పరమైశ్వర్యశాలివగు నోయీశ్వర ! 'మయి' నాయందు విజ్ఞానయుక్తశుద్ధేంద్రియములనుంచుము. 'రాయః' ఉత్తమధనమును 'మఘవన్ !' ఓధనవంతా ! మాకు 'సచంతామ్' చేకూర్చుము. ఓసర్వకామ ! నీయనుగ్రహమువలన మాకోరికలు సత్యములగుగాక ! ఓభగవంతా ! మాయాశలను నీవు త్వరగా తీర్చుము. మా న్యాయయుక్తములగు సత్యకామనలు ఫలించుటవలన మేము ఎల్లపుడు పరమానందము ననుభవింతుముగాక !

( ప్రార్థన )

"ఓ౩మ్ సదసస్పతి మద్భుతం ప్రియ మింద్రస్య కామ్యమ్
సనిం మేధా మయాసిషం స్వాహా." 52

(య. 32-13)

శ. అ. :- ఇంద్రస్య = జీవాత్మని, ప్రియమ్ = ప్రియమిత్రుడు, కామ్యం = ప్రాప్తవ్యుడు, అద్భుతం = విలక్షణుడైన, సదసః పతిమ్ = విశ్వేశ్వరుని, సనిమ్ మేధాం = వివేచనాశక్తినిచ్చు మేధాబుద్ధిని, అయాసిషమ్ = యాచించుచున్నాను, స్వాహా = ఇది నాహృదయగతసత్యవాక్కు.

ద. వ్యా. :- ఓసభాపతీ! విద్యామయ! న్యాయకారీ! నీవు మమ్ము సభాసదులను, సభాప్రియులను, సభయే మాకు న్యాయమొనర్చురాజు కావలయు ననుకోరిక గలవారలనుగా జేయుము. కొండొకవ్యక్తిని మేమెన్నడు రాజుగా నంగీకరింప కుందుముగాక! నిన్నే సభాపతిగా, రాజుగా, సభాధ్యక్షునిగా నంగీకరింతుముగాక! నీవు అద్భుతశక్తిమంతుడవు, ప్రియ స్వరూపుడవు, జీవునకు కోరదగినవాడవు నీవే. 'సనిమ్' జీవుల కెల్లరకు బాగుగ భజింపదగినవాడవు నీవే. విద్యాధర్మసత్యాదు లను ధరించుబుద్ధిని నేను కోరుచున్నాను. నీవు కృపతో దాని నొసంగుము. ఇదియే నా వాణి చెప్పుచున్నది. 'స్వాహా' నీవే జీవులకు సేవ్యుడవు. వేదమున ఈశ్వరాజ్ఞ ఇదియే. దీని నెల్లరు నంగీకరింపవలయును.

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ యాం మేధాం దేవగణాః

పితరశ్చోపాసతే తయా మామద్య మేధయాగ్నే

మేధావినం కురు స్వాహా." 53

(యజు. 32-14)

శ. అ. :- దేవగణాః = విద్వాంసులు, పితరః చ = పితరులును, యాం మేధాం=ఏయుత్తమబుద్ధిని, ఉపాసతే= సేవింతురో, అగ్నే !=ఓతేజస్వీ! ఈశ్వర !, తయా మేధయా= ఆయుత్తమబుద్ధితో, అద్య = ఇప్పుడు, మామ్ = నన్ను, మేధావినం కురు = బుద్ధిమంతుని చేయుము, స్వాహా = ఇది నాహార్దికమైన అభిలాష.

ద. వ్యా. :- ఓసర్వజ్ఞ! పరమేశ్వర! అగ్నీ! విజ్ఞానవంతమై, ధారణాశక్తిగలిగిన యేబుద్ధిని విద్వాంసులు కలిగియుందురో, అట్లే యథార్థముగ పదార్థముల నెఱుంగు పితరులు, విజ్ఞానులు నేబుద్ధిని గలిగియుందురో యట్టి యుత్తమబుద్ధిని నాకు ఇప్పుడే ప్రసాదించి బుద్ధిమంతుని జేయుము. నీవు కృపతో నా యీప్రార్థన నంగీకరించి సఫలము చేయుదువుగాక !

( ప్రార్థన )

ఓ3మ్ మేధాం మే వరుణో దదాతు

మేధా మగ్నిః ప్రజాపతిః మేధా మింద్రశ్చ

వాయుశ్చ మేధాం ధాతా దదాతు మే స్వాహా." 54

(య. 32-15)

శ. అ. :- వరుణః = శ్రేష్ఠుడైన ఈశ్వరుడు, మే = నాకు, మేధాం = మేధాబుద్ధిని, దదాతు = ఇచ్చునుగాక !, ప్రజాపతిః అగ్నిః = ప్రజాపాలకుడగుస్వామి, మేధాం దదాతు = మేధను ఇచ్చునుగాక, ఇంద్రశ్చ వాయుశ్చ = ఇంద్రుడు, వాయువు, మే = నాకు, మేధాం దదాతు=మేధ నిచ్చుగాక ! ధాతా = జగత్తు ధరించుస్వామి, మే = నాకు, మేధాం = మేధను, దదాతు = ఇచ్చునుగాక ! స్వాహా = నాహార్దికాభిలాష.

ద. వ్యా. :- ఓసర్వోత్కృష్టేశ్వర ! నీవు, 'వరుణం' వరణీయమగు ఆనందస్వరూపుడవు. దయతో నీవు నాకు సర్వవిద్యాసంపన్నబుద్ధిని ప్రసాదింపుము. అట్లే విజ్ఞానప్రదుడు, విజ్ఞానస్వరూపుడు (అగ్నిః, ప్రజాపతిః) సర్వసంసారాధిష్ఠాతయు, అనంతబలవంతుడు, పరమైశ్వర్యవంతుడునగు నా పరమేశ్వరుడు నాకత్యంతోత్తమబుద్ధిని ప్రసాదించునుగాక !

21]

( స్తుతి మంత్రము )

"ఓ౩మ్ ఇదం మే బ్రహ్మ చ క్షత్రం చోభే
శ్రియ మశ్నుతామ్ మయి దేవా దధతు
శ్రియ ముత్తమాం తస్యై తే స్వాహా." 55

(య. 32-16)

శ. అ. :- ఓపరమేశ్వర! కృపతో, మే=నా, ఇదమ్ బ్రహ్మ = ఈబ్రహ్మవేత్త, విద్వాంసుడు, క్షత్రం చ=క్షత్రియుడును, ఉభే = ఇరువురు, ప్రియం = ప్రియమును. అశ్నుతామ్ = అనుభవింతురుగాక! దేవాః=విద్వాంసులు. మయి= నాయందు, ఉత్తమాం శ్రియమ్=ఉత్తమలక్ష్మిని-శోభను, దధతు = ధారణచేయుదురుగాక! ఓసజ్జనులార! తే = నీకొఱకు, తస్యై = ఆశ్రీని ప్రాప్తించుటకు, మాయత్నములు జరుగును. ఇది మాశుభసంకల్పము.

ద. వ్యా. :- ఓసర్వేశ్వర! మహావిద్య! మహారాజ! విద్వాంసుడు, క్షత్రియుడు ఇరువురు నీకృపవలన నాకనుకూలు రగుదురుగాక! 'శ్రియమ్' విద్యాదిమహాలక్షణయుక్తమగు మహారాజ్యశ్రీ మాకు లభించుగాక! దేవాః!=విద్వాంసులార! దివ్యమగు నీశ్వరగుణయుక్తమగు సంపద నాయందు స్థిరముగా నుండునట్లనుగ్రహింపుడు. దానిని నేను ప్రేమతో పొంది ప్రపంచహితముకొఱకు, రాజ్యాదివ్యవస్థ కొఱకును ఉపయోగింతునుగాక!

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యాణామ్
శ్రీయుతవిరజానందసరస్వతీస్వామినాం మహావిదుషాం
శిష్యేణ దయానందసరస్వతీస్వామినా
విరచితార్యాభివినయే
ద్వితీయః ప్రకాశః
సంపూర్ణః

ఈయార్యాభివినయమున కనువాదము
శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యులైన
శ్రీయుతఆత్మానందసరస్వతీ
స్వామిపాదులశిష్యుడైన
పండితగోపదేవునిచే
ఆంధ్రమున రచింపబడినది.





పండిత గోపదేవ్

| | | |
|---|---|---|
| జననము | : | క్రీ. శ. ౧౯౦౦ ప్రాంతము. |
| జననీజనకులు | : | శ్రీ అంబమాంబా రామయార్యులు. |
| స్థానము | : | కూచిపూడి, తెనాలి తాలూకా, గుంటూరుజిల్లా. 522313 |
| విద్యాభ్యాసము | : | కాశ్యాది విద్యా పీఠములు, సంస్కృతాంధ్ర హిందీ సాహిత్యములు. |
| అభిమాన విషయములు | } | షడ్ దర్శనములు, నైష్ఠిక బ్రహ్మచర్యము, యోగమార్గ ప్రావీణ్యము. |
| వృత్తి | : | వైదిక ధర్మ వ్యాపకత. |
| రచనలు | : | అయిదు దర్శనములు, పదునొకండు ఉపనిషత్తులు, ఆస్తిక వాదము, అర్థ ధర్మ మీమాంస, శ్రీమద్భగవద్గీత ఋగ్వేదాది భాష్యభూమిక, సత్యార్థ ప్రకాశము, షోడశ సంస్కారవిధి, ఆత్మచరితము మొదలైనవి (45) |